# మారుతివిజయము.

(మైరావణవధ.

గ్రంథకర్త:- కోపల్లె పుండరీకాక్షశర్మ



ప్రకాశకుడు:- కందుల గోవిందము.

ఓం

# వారుణీ విజయము

అను

## మైరావణవధ

ఇది

## శ్రీ పల్లె పుండరీకాక్షశర్మ

విరచితము.




ప్రకాశకులు

## కందుల గోవిందం

జనరల్ బుక్కుడిపో

బెజవాడ. కృష్ణాజిల్లా

1926

కాకినాడ.

స్కేప్ అండు కో; ముద్రాక్షరశాలయందు ముద్రితము,



వెల] [1—0—0

## ఈ నాటకమునందు వచ్చు పాత్రలు వివరము

హనుమంతుడు

మైరావణుడు (పాతాళలంకాధిపతి)

మత్స్యవల్లభుడు (ఆంజనేయుని కుమారుడు)

నీలుడు

అంగదుడు

సుజాలుడు

విభీషణుడు (రావణుని తమ్ముడు)

సుగ్రీవుడు (వానరప్రభువు)

ఘటకుడు (మైరావణుని సేవకుడు)

భైరవుడు
దుష్పదుడు } మైరావణ మంత్రివర్గము

సూతుడు (రథసారథి)

స్త్రీలు

దుర్దండి (మైరావణుని చెల్లెలు)

మాతంగి (మైరావణుని భార్య)

ఇంకను సేవకులు మొదలగువారు వత్తురు.



శుభమస్తు.

శ్రీరామచంద్ర.

# మారుతివిజయము.

నాంది.

శా. శ్రీకాంతామణి పేరురంబు వయినన్ జేర్పంగ శ్రీకౌస్తుభా
స్తోకస్ఫారసుసారదీధితులు సంతోషంబునం గాంచఁగా
శ్రీకాంతామణియేమిపున్న మొనరించెన్ మాదుపాపంబదే
మీకాప్పింపుడటంచు వాక్కులహామ్ముల్ గావించు ద్వైప్తాదికాం
తాకాండంబులనాత్మమోదమిడు భక్తాధిసుండేలుఁ మిమ్ముల్.

చం. సరసుఁడు సర్వశాస్త్రముల పారముఁ గాంచిన పండితుండు సు
స్థిరహృదయాబ్జజుండు రణధీరుఁడు కామకళాకలాప సం
హరుఁడు నిశాచరార్ణవ మహాపసికిన్ వ్రిశయాగ్ని అంజనీ
వరతనయుండు వాయుజుఁడు. ప్రాజ్ఞులనెల్లరఁ గాచుఁ గృపన్.

సూత్రి—(నాంద్యంతమున ప్రవేశించి) నేఁడుగదా? నామా
ససమానంద ప్రపూర్ణమయ్యెను. ఏలనన,

చం. సరసులు పండితోత్తములు సాంద్రయశస్కరులార్యలోక సం
చరణకళా విశారదులు సారసనేత్ర పదాబ్జభక్తిసం
చరణవిలాసులైన బుధసత్తములెందరొ గూడియున్న యీ
సరససభం గనుం గొనిన స్వాంతము సంతసమందకుండునే.

విద్వద్గేసరులారా! మీరిటసమావేశమైతిరేల? (వినుటనభినయిం
చి)ఏమీ! భక్తిరసప్రధానంబగు నేఁదేనొక్క ప్రదర్శనంబును తిలకించుఁద

లించిరయా? షరితే! నాశక్తికొలఁది మీయుల్లంబులు పల్లవింపఁ జేసెదఁ గాక, మారిషా! నీవొకసారియిటురమ్ము.

మారి.—(ప్రవేశించి) బావా! నన్నేలపిలచితివి. యీయుట్ట హాసమేమి?

సూత్ర—ఉదయముననే చెప్పితినిగదా? నేడురూపక ప్రదర్శన మని. పాత్రలసిద్ధపఱచితివా?

మారి—నటులచింత మీకేల? మీరిటప్రదర్శించు రూపక మెయ్యది?

సూత్ర—మారిషా! చెప్పెదను వినుము.

సీ. భానుపుత్రుని దుఃఖభారంబుఁగనలేక
కష్టించితీర్చిన ఘనుడెవండు
కుటిలరావణుకోట కటువిక్రమంబున
ధరణిపాలొనరించె ధన్యుడెవఁడు
మాయశక్తికిని లక్ష్మణుఁడు వ్రాలినవేగ
సంజీవిగిరిఁదెచ్చి సాకెనవఁడు
రథసీమవిజయుని రథకేతనమునుండి
చిలువబాణమువమ్ము సలిపెనవఁడు

తే. గీ. అతఁడు సాకేతపురాణసతీ ప్రాణనాథుఁ
డనుచుజగతుల పూజింప మనెడునెవఁడు
యతఁడు జగదేకవీరుండు నమలచరితుఁ
డాంజనేయుండు ధరణి ప్రఖ్యాతుఁడతఁడు.

ఆమహాసీయుని చారిత్రింబగు మారుతీవిజయము నిటప్రదర్శింపఁ దలంచితిని.

మారి—బావా! గ్రంథకర్త లెవ్వరు?

సూత్రి—మారిషా! వినుము.

సీ. అమరికొండల్లె వంశార్ణవంబు సుపూజ్య
తను బొందజనియించె ననఘులెవరు
పావనత్వమున నొప్పారు శ్రీగుడివాడ
నిజనివాసంబుగాఁ దనరెనెవరు
మేడూరు పురవరమేదినీశ్వరు చేత
బహుళయశంబంది ప్రబలెనెవరు
సుబ్బమాంబికయందు సుతనొక్కఁ డెను పుత్రి
ద్వితయంబుఁగాంచెనే వినుతయశుఁడు

తే. గీ. అట్టి వేంకట కృష్ణయామాత్యద్వితీయు
బాలుఁడు సజ్జనానంద పాలకుండు
రామభక్తావలో కనకాముకుండు
పుండరీకాక్షుఁడు రచించె పొలతిదీని.

మారి—(నవ్వుచు) బావా! తుదకు శబ్దములైనను జదువని యీతనిచే రచింపఁబడిన నాటకమునా ప్రయోగింపఁ దలంచితివి? ఇది తుదకు నటులకుకూడ యమర్యాదాపాదకము! పండితులధిక్షేపించెదరు.

సూత్రి—ఓయీ! మారిషా!

చం. సరసులు బాలువాక్యముల స్వాంతమునంద సుఖంబునంద స
త్వర ...గ వారిపల్కులని వారకవీనులఁ జేర్చునట్లు దు
ష్కరకుకవీంద్ర కోటిమది సంతసమందక వెక్కిరించుగా
కరయగసజ్జనుల్ గుణములారసి మెచ్చినసంత చాలదే?

మారి—బావా! అట్లయిన మనమిప్పుడేమిచేయవలయును?

సూత్రి—మారిషా! నీవేగి రంగస్థలంబునలంకరింప పాత్రల సిద్ధము చేయుచుండుము. నేనీసభాసదులకొక విన్నపము నొనర్చి వచ్చెద.

మారి—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

సూత్ర — సభాసదులగు నోవిద్వదగ్రేసరులారా! ఈనాటక రచయిత మీతోఁడ నిట్లని విన్నవింపఁగోరుచున్నాఁడు. సభాసదులారా!

చం. కవితయనంగ నొక్కనికిఁగాదు వరించియు చేకొనంగ పూ
ర్వవిబుధులెందరో కవిత వ్రాయఁగ యత్నము సల్పుచుందురే
అవిరళమోహరూపమున నాత్మకుయింపగువాని జేరు నా
కవిత ప్రియత్నముల్ సలుపు కాపురుషుల్ దిలకింపదెంతయున్.

ఉ. పాలువహించి గ్రంథములు వ్రాయఁగ సత్వము లేకయున్న మి
త్రాళిమనోహితంబు కొఱకై రచియించితి గానఁ దప్పులున్
జాలగనుండు వానివిడి సత్వరముల్ గొనుఁడయ్యయొప్పులే
సాలఫలంబులన్ విడి రసాలములన్ గ్రహియించురీతిగన్.

మఱియును,

మ. అసురాధీశుని సాధ్విపల్కులను మీరాలించి యావిస్మృతుల్
అసురాధీశకులాటవీ దహనదుఃఖాలాపముల్ గాంచి యా
యసురాధీశవనేచరోత్తముల సంగ్రామంబువీక్షించి మా
నసముల్ దేల్చబడి సంతసార్ణవములోనన్ వీచికాపద్ధతిన్.

ఇదిప్రస్తావన.





శుభమస్తు.

శ్రీరామచంద్ర.

# మారుతివిజయము.

## ప్రథమాంకము ప్రథమరంగము.

(సుజాలుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సుజా—(తనలో) నేటిప్రాతఃకాలంబున పరమాదేవి నన్నుఁజేరం జీరి "వత్సా! సుజాలా! నీవుసత్వరంబున రఘురామురాజువంశాబ్ధి సద్యశోవిశాలుండగు మత్ప్రాణేశ్వరుఁగనుంగొనియే కాంతంబున దానవ వంశదవానలంబును కైకసీగర్భార్ణవ కాలకూటంబును దుష్టజనచూడామణియునగు నీయన్నరావణుఁడు నిన్నటిరేయి రసాతలనాధుండగు మైరావణుఁ జేరఁబిలచి మహామోహాంధకారంబున కన్నుమిన్ను నెఱుంగక సత్పథసంచారుఁడగు దశరథ ప్రథమతనూభవ కాంతారత్నంబును కాంతారంబుననుండ యపహరించి తెచ్చి మదీయపురాలంకారంబగు నశోకవనంబున నుంచెతిని. అటుపిమ్మట కొన్నిదినంబులుగడచిన నొక్కవానర మరుదెంచి యశోకంబు నాశంబొనరించి పురంబగ్నికాహుతి యొనర్చిచనియె. అంతకతిపయ వాసరంబులకె చతుర్విధసేనా సహితంబుగ రాముండరుదెంచి వారాసి గిరుల బంధించి మదీయపురం

ప్రోత్సహించి భటామాత్యసహితంబుగ మదీయపుత్త్రశతంబునుం దును మాఁడి చెల్లినన్నుఁగూడ యమపురంబున కంపననుకట్టుచున్నవాఁడు. నన్నెట్లయినను యీమహోపద్రవమునుండి యుద్ధరింపవే" యని వేఁడ యాతఁడు ప్రథమమున హితోపదేశ మొనర్చియు నే కారణంబున నో రామలక్ష్మణుల వధింప ప్రతినయొనర్చె. కావున నెట్లయినను నా కుటిల కర్మనకు జిక్కనీయక రఘువంశజులను కాపాడువిధంబు చూడ వలయునని చెప్పిరమ్మని నన్నుపంపెను. నేనును

తే. గీ. పరమసందేశమును వేడ్క స్వామికపుడ
తెలియఁబలికితి లోటింతఁగలుగకుండ
కపులకంటను బడకుండ నిపుణముగను
తెలివియున నావశంబయి వెలయునింక.

అయినను గర్వింపరాదు. ఏలయనఁ గోఁతులు పసివట్టఁగలవు. అటుచేసినచో— నాప్రాణములకు నీళ్ళువదలవలసినదే. ఎదురొడ్డి పోరబలశౌర్యంబు లావశ్యకంబులు. అందొక్కటియైనను మందునకైన నామెడ కనఁబడవు. ప్రాణంబుల కాశపడి పరువిడుదునన్న నాకదియును చేతఁ గాదు. కావున తడవు నేనిచ్చట మసలక త్వరితంబుగ లంకాపురంబు ప్రవేశించుటయే యుత్తమము. (ప్రక్కల దిలకించి) నేనిప్పు డేమిసే యుదును? నేత్రంబుల నగ్నికణంబులు వర్షధారలఁ బోలెఁ గురిపించు చు వనచరు లిరువు రీవైపే పఱుగుపఱుగున వచ్చుచున్నవారలు. న న్ను చూచిరేకాఁబోలు! నేనిప్పు డేమిసేయుదును? పఱుగులిడుదు నా? (ఆలోచించి) అది కూడదు. ఏలయన— వారికిది వెదుకఁబోయిన తీగె పదములఁ దవులుకొనుటగాదా? కావున నేదోయొకవృక్షముననె క్కి వీరిచ్చటినుండి యరిగినపిదప నే నరిగెదఁగాక!

(అని వృక్షమునధిరోహించును)

(పైన చెప్పినప్రకారము నీలాంగదులు ప్రవేశింతురు.)

అంగ—నీలా! పవన, నల, జాంబవంతాది వీరయోధకల్పితము గు మనసైన్యవిజృంభణముఁ గనుఁగొనుము. రణరంగంబున ననంగునిభంగంబునొందించిన రుద్రునిమాట్కి గనఁబడుచున్నారు.

చం॥ అదెకనుమస్మదీయకపులాహవ ముద్ధతిరీతి నల్పుచో
పదపదయంచు నెట్టుకొని పౌరుషమింతయు లేక పందలై
కదనమువీడి రావణుని కాల్బలముల్ వడిఁబారునట్టి తీ
రదెగను మీవిధంబెగడ యల్పులశక్తులు సంగరంబులన్॥

మఱియును,

తే-గీ॥ బాహుబలమున వైరులపనయడంచి
బ్రతుకవలెగాక తుచ్ఛంపుబ్రతుకదేల
కాకి చిరకాలము ధరిత్రిఁ గడపెనేని
గరుడునిం దానుపోలఁగాఁ గలదె చెపుమ॥

ఒకవేళ రాక్షసులు రణంబున పిఱుతివియక నిలిచిన మనవారియెదుట వారియాటలు సాగునా? (తెఱవంకఁజూచి) ఓవనచరవీరులారా!

సీ॥ పట్టినలగ్గలపట్టువీడక ఘోర
రాత్రించరులఁబట్టి రాల్పవలయు
కోటకొమ్మలకెక్కి మేటినాబత్తుల
వన్నిఁటిఁ బగులంగఁ దన్నవలయు
ప్రాకాలపైనాళమాని హాహాకారి
కదనంబునేర్పుతోఁ గడుపవలయు
ప్రాకటగోపురప్రాకారములతోడ
భూమిమట్టముచేసి పోవవలయు

తే॥గీ॥ శ్రీరమాపతి జానకీచిత్తచోరుఁ
జేల పోరాడనని చెప్పి డీలుపడఁగ
రావణాసురు నొనరించి రావలయును
మీబలంబునకబికుల మిహిరులార॥

నీలు—అంగదా! ఏలనీకీపిచ్చి? నిశాచరు లెన్నఁడైనను సమర భూమి కాలూదినిలిచినచందంబు వినియుంటివే? ఈతుచ్ఛుం డగురావణుఁ డనేకసమయములయం దనమానవరాక్రమశాలి యగునీజనకుని జయింపఁదలఁచి పోటుతనంబు వీటఁబుచ్చి దొంగతనముగవచ్చి వ నీజనకుండది కనుంగొనినంతనే శరణనివదములఁబడి యెట్టిటో ప్రాణంబుల నిల్పుకొనుచుండెడువాఁడు. ఈనిశాచరకులం బంతయును—

మ॥ వగతుండెన్నఁగ నుక్కుమీరి తమకొంపల్ దీయులాగున్న ను
వ్వుగ ప్రాణంబులు మేననుండినను నేభూపాలుఁడో ప్రోచునం
చుగుణంబుల్ గుమురంగఁ జేసికొని నీచుల్ పారుచున్నారు దు
ష్టగణప్రజ్ఞలు యుట్టివేకద రణక్ష్మారంగమం దంగదా॥

మఱియును వీరు,

తే_గీ॥ తమనిశాచరవంశీయధరణిపతులు
సోమకాదులు కదనంపుభూమివిడచి
జనినమార్గంబుగాక; నేచక్కఁజనగ
జాలుదురువీరు గ్రహియింపు వాలితనయ॥

అంగ—అవును. ప్రచండమారుతంబులకెదురొడ్డి మేఘంబులు నిలువఁజాలునా? అట్లనే మనబలములధాటికిఁ దాళఁజాలక రాక్షసగణంబులు,

సీ॥ కరములఁబట్టిన కరవాలములవీడి
సమరభూమినిబాసి చనెడివారు

వారువంబులడిగ్గి పాదచారులెయాచు
చల్లగా పరువెత్తిపారువారు
ప్రాణాలపయినాశ బూనివేవేగము
మారురూపములతో బారువారు
తరువెత్తలేకపో వగతుఁబాటికిఁజిక్కి
నాఁడనంచు పోదల నక్కువారు
తే.గీ॥ చచ్చిపడియున్న మృగములచాటుఁజేరి
బ్రతుకుమింకను జీవుఁడా బ్రహ్మవ్రాత
ను సట నీవిధిలిఖయింప నెసఁగునొక్క
మనకు జయమంచుమనమాదు మ్రొగ్గువారు॥

కావున నిట నెటనైనను ప్రాణంబులకాశించి రక్కసులు దాగియుందురేమో? వెదకి వారిగుట్టులనెల్లఁ గనిపెట్టి తగురీతిని బ్రవర్తింతము.

నీలు—అది యుత్తమమైనకార్యము. దాన మన కెంతయో మేలు చేకూరును.

సుజా—అక్కటా! ఏ రిదియన్మతయు వెదకెదరుకాఁబోలు! నేను నిశాచరుఁడనగుట నన్ను తమమిత్రుఁడగు విభీషణసేవకుఁడనని తలంపక యెన్నివిధముల బాధింతురోకదా! కట్టా! ఎట్లో వానరసమూహమునుండి తప్పించుకొంటినని గర్వించితిని. ఇంక నిచ్చట జాగొనరించితినేని నాకు మరణంబు శరణంబగును. కావున నీస్థలత్యాగము సర్చి పరువెత్తిపోయెదఁగాక. (అని పరువిడును.)

అంగ—(సవ్వడి నాలకించి) నీలా! అదే మనమాటలసవ్వడి విని యిఁక నిచ్చటనుండిన ప్రాణములు నిలువవనితలఁచి బక్కరక్కసుండదె యాదెసకు కడువడిగ పరువెత్తుచున్నాఁడు. నేనిదేపోయి యాతనిఁ బట్టి తెచ్చెద. అంతపర్యంతము నీవిచ్చటనుండి యింకనెవ్వరై

నను నటునిటు బోవుచుందు రేమొకా కనుఁగొనుచుందుము. (అని నిష్క్ర)మించి మఱల సుజాలునితో బ్రవేశించి) ఓరోరి! నీచకులసంజాతా!

పంచచామరము

దురాత్మ! దుర్మదాంధ! క్రూర! దోఃప్రతాపశాలియౌ
ధరాధినాధుసైన్యమంచు దల్పవో మనంబునన్
ఖరాసిఁబూని నీదునాల్క కండకండలౌనటుల్
గరాన! కోయువాఁడ నిప్డె కాచుకోరబాలిశా!

నీలు—ఓయీ అంగదా! పగతుఁడు చేతికిఁజిక్కినమాత్రంబున బెదరింప భావ్యమా! అది రాజనీతికి దూరంబుగాదా? ఇట్టివిరుద్ధకార్యంబుల మనంబు చొప్పింపనగునే? అదియునుంగాక; యితం డొకవేళ మనహితుండగు విభీషణుని నమ్మికపరిచరుండైన మన కెంతయుపకీర్తి వాటిల్లును? సజ్జనులు సర్వదా శాంతమునే భజింపవలయుననునార్యోక్తి వినియుండలేదా? కావున నీవొక్కింతశాంతము వహింపుము. మనము వీనియుదంతమునంతయు నారసి కార్యంబుతెలుంగ ప్రవర్తింతుదము. (సుజాలునితో) ఓయీ! భీతహృదయా! నీవెవ్వరవు? నీనివాసస్థానమెయ్యది? మఱియు,

ఉ॥ ఏవిధ నీవుచొచ్చితివొ యీకపిసేనను యేమి కారణం
బీవిటఁజొచ్చిపోవుటకు యెవ్వరికైయిటువచ్చినావు; నీ
భావము కోమలంబొ; కడుపాపమొ వేగనెఱుంగఁజేసి నీ
త్రోవను బొమ్ముప్రాణములతోడ పిశాచర సత్వరంబుగన్॥

విధుకులుండవగుట నిన్నింతిగసందేహింపవలసివచ్చె. కావున నీవృత్తాంతంబెల్ల నిక్కము వచింపఁగోరెదము.

సుజా—(తనలో) అకటకటా! గర్వము వినాశహేతువని యెఱింగియు ఎరకాసించి బోనులోజిక్కు కొను శార్దూలంబువగిది కష్ట

లకన్నుల దుమ్ముగొట్టితినని గర్వించి నేనంతటిదుస్థితికి వచ్చితిని! నేనిప్పుడేమిచేయుదును! నిజంబులు కల్లలై, కల్లలే సత్యంబులై నెగడు యిక్కాలంబున నే విభీషణసేవకుండ నని చెప్పినమాత్రంబున విశ్వసింతురా? ప్రప్రథమంబున నే నేత్రంబుల నగ్నికణంబులు జలధరంబులు జలంబులఁగురియురీతిఁ గురిపించిన యీయింద్రపౌత్రుండును, మర్యాదాభాషణంబులఁ బల్కుచుతిరియగునంతమట్టు పెట్టదలంచు యీనీలుండును సన్నారకవిడతురా? అక్కటా! నేడు కపివరాఘాతంబుల మరణింపఁదలువ నెన్ను నలబలీయంబుగ లిఖించిన వ్రాలు యీవిధినుండఁగ నారికేళలంకాప్రవేశకవిషయంబున నాత్రితకల్గునను? ఓదీనజనావనోద్ధారా? రవికులదుగ్ధవారాశి పూర్ణిమచంద్రా! రామచంద్రా! నేవక్కాణించువాక్యంబులు వీరికి నిజమనితోచువట్లు చేయుము. (ప్రకాశముగా) అయ్యలారా! నేనీ లంకాపురవాసిని. నన్ను సుజాలుఁడందురు. విభీషణమహారాజుగారి నమ్మికబంటను. మదోన్మత్తుఁడగు రావణుఁడు మాయావియగు మైరావణునిఁగూడి దీనజనమందారులగు రామలక్ష్మణుల వధోపాయంబులు నలుపు ప్రయత్నంబుల నెఱింగి యాసంగతుల మా మహారాజుగారి కెఱింగింపవచ్చితిని.

అంగ—(కోపముతో) ఓరీ నిశాచరవంశకాలకూటమా! రావణానుచరా? పాపీ! అమృతాలాపంబుల మాకుజాలిఁబొడమునట్లుపల్కి మాభుజపంజరంబులనుండి తప్పించుకొననెంచుచుంటివా? మాహృదయంబులు నిశాచరులపై నెంతయుఁ గఠినత్వంబు వహించునే కాని ఎన్నటికినిఁ గఱుఁగవని యెఱుంగుము. అదియునుంగాక! యతఁ, పన్నగ, సిద్ధ సాధ్య సురాసురులైనను మాకన్నులంబడి యొక్కయడుగైనఁ గదల్పలేరు. నీవననెంత? ప్రాణంబులపై నాశ మవంబున ధృఢంబుగ నాటునేని సత్యంబుపల్కుము. లేకున్న జీవంబులకుఁ జెడదవ్వు

సుజా—(తనలో) అక్కటా! వీరు నేను సత్యంబునేబల్కి నను యధర్మమని తలఁచి బాధించుచున్నారు. నేనేమిచేయుదును? ఇచ్చట నాకెవ్వరుదిక్కు? ఇఁక నాజీవంబులకు నాశవదలుకొనవలయుఁగాఁ బోలును!

నీలు—(కోపముతో) ఓరీ! రాక్షసాధమా! నిజంబుఁ జెప్పెదవని నయభయంబులఁ బెదరించినను రాక్షసులకలంకారమగు నసత్యమునే బల్కితివిగా! ఆలోచింపుము. ఇప్పటికైనను కార్యమిసుమంతయు మించలేదు. కావున నీవెవ్వఁడవో సత్యమునెఱిఁగించి ప్రాణరక్షణోపాయంబాలోచించుకొనుము.

సుజా—అయ్యలారా! ఇంతియునిజంబు. నన్నేలబాధించెదరు. నేనసత్యంబులాడువాఁడను గాను. రాక్షసకులసంజాతుండనగుట మీరిట్లు సందేహించి యుందురు. కావున నామాటలయందు నమ్మకముంచి విడువవేఁడుచున్నాఁడను. అసత్యంబులు పలికిన వాశ్రీరామచంద్రునిపదంబులాన.

అంగ—(కోపముతో) అసత్యప్రలాపీ! అసత్యంబులు పలుకుటయేకాక శ్రీరామునిపై నానబెట్టెదవా? కాలాహిదంష్ట్రలనుండి యమృతరసంబుకురియునా? సత్యమును రోసియసత్యమును బల్కుట మీనిశాచరవంశపు గుట్టునంతయు బేలతనంబునఁ బైటఁబెట్టుకొనుటయేకాని దానఁ బ్రయోజనమేమియుగలదు. అదియునుంగాక?

ఆ॥ వె॥ తలనుదడపిబాన వలనొప్పసలిపిన
నమ్మరాదు మిమ్ము నళినముఖుల
పాముమంచిదంచు పాల్పోసిపెంచిన
తఱినివేచికాటుఁ బఱుపకున్న!

కావున నేనిదే వైరివీరపక్షవిక్షేపణకాలానలసన్నిభంబగు మదీయ వాలంబున నీప్రాణసమితిని దేహంబునుండి తొలఁగఁజేసెదను. ప్రచం

డంబగు మదీయకోపానలజ్వాలలంజిక్కిన నిన్నెవ్వఁడు కావఁగల్గునో చూ చెదఁగాక! మీ వెంతగ సాధుభావంబున బ్రతిమాలుచున్నను సత్యము నుజెప్పవుగా? నీకునుఁ గన్నులు నె త్తికివచ్చె (అనికొట్టును.)

సుజా—హా! మహారాజా! రక్షింపుఁడు. రక్షింపుఁడు. ఎవ్వ రో తరుచరులిరువురునన్నుఁబట్టి మితి లేని వేదనలనుంచుచున్నారు. వే గవచ్చి రక్షింపుఁడు.

(తెరలో)

చం॥ భయపడకో సుజాలయిదె భండనభూమిని వైరివీరులకా
హాయములతోఁడఁగూల్చినను నార్తునిదీనుని బ్రోవ నేనిదే
రయమునవచ్చితిన్ సుగుణరాశివి! ఎవ్వరునిన్నుకూరులై
భయమునముంచుచుండిరొకొ వారణజేసెద వారినెల్లరన్.

(పైపద్యమును చదువుచు విభీషణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విభీ—

చం. నిలునిలుమంగదుండ! యిటునీలుడ! చేయుట న్యాయమా నె? మీ
బలమునుచూపఁగాఁ దగిన బాలిశు లెవ్వరు లేరె! అక్కటా!
బలమినుమంత లేక ధర పైనటొ ప్రాణముదాల్చినట్టి వా
రలఁగనికొట్టివంతటను ప్రాభవమబ్బున కీర్తిగల్గునే!

అదియునుంగాక న్యాయాన్యాయవిచక్షణ లేక మీరలిట్టుల రజనీచరు లగుపించినంత దండించుచుండిన దురాత్ములదుష్టచేష్టితంబుల నెఱుంగ నాపితామహునకైనను శక్యంబగునా? దానమునకు జయంబురయంబు న కరగతంబగునా? కాన నావాక్యంబుల నమ్మకంబుంచి యాతనిని విడచి నావెనువెంటరండు.

నీలు—విభీషణా! ఏలయిట్లువాకు్రుచ్చెదవు. పగతుఁడు చేజిక్కిన దండింపరాదేమి? అవునౌను. నిన్ననన్నఫలంబేమి? జన్మించినది దానవ

కులంబుగదా? ఇదివరకు సజ్జనుండకుని నిన్ను నమ్మినవారనుగుట యిం. తవరకును మాకుటీరంబుల నుండనిచ్చితిమిగాక? నేటిసందర్భమున నేడే నీకంఠకము పెట్టించెద.

అంగ—నీలా! నీవూరకుండుము. రావణానుజా ! ఈరక్కసు డెవ్వఁడు? వీఁడు కపిసేనఁజొచ్చుటకుఁ గారణమేమి? ఆసంగతినంతయు మాకెఱింగించిన వీనిని విడనాడువారము. లేకున్న వీనికి మరణంబే శరణంబు.

విభీ—నీలాంగదులారా! ఈతం డన్యుఁడైన వీనిని వదలిరండని మీకుఁ జెప్పుదునా? ఇతండు మదీయసేవకుండు. సుజాలుండనువాఁడుఁ. దుష్టులదుష్టచేష్టితంబుల కొన్ని నాకెఱింగించి మెలఁగుచున్నవాఁడు.

నీలు—ఆతఁడు నీకేమిసంగతుల నెఱింగింపవచ్చెను?

విభీ—నీలాంగదులారా! మీప్రశ్నలకు సమాధానము లీయ వచ్చునుగాని.

తే॥గీ॥ తడవుమసలిన కార్యమంతయును జెడును
యిప్పుడేటికి కొలఁవుంగో నెఱుక పరతు
సత్వరముపోయి హనుమంతు జాంబవంతు
సూర్యపుత్రాదివీరులఁ జూడవలయు.

మీమ్మాట సంగతులన్నియు వానియంతటనవియే మీకు తెలియగలవు. సభాముఖంబుననే వానినన్నిటిని మీకెఱింగించెదను, పోదమురండు, (అని నీలాంగదులతో ప్రస్థానము)

సుజా—(తనలో) అబ్బబ్బా! ఈకపులచేతఁజిక్కి ప్రాణంబుల తోఁడ నిల్చుట చతురాస్యునకైనను తరముగాదు. అట్టియెడ నేనన నెంత? (శరీరముచూచుకొని) నాశరీరమంతయు వగులఁగొట్టెనుగదా? యాయంగదుఁడు. వాని పరాక్రమమే యిట్లత్యద్భుతమైనప్పుడు తక్క

నవీరులసంగతి వేరనుకువనేల? ఇంక నేనిచ్చటనున్న నెన్నికోతులు వచ్చినన్నుకదగండ్లపాలుచేయునో? కాన సత్వరంబున లంకాపురంబు ప్రవేశించెదఁగాక. (అని నిష్క్రమించును.)

## ద్వితీయరంగము.

(సుగ్రీవహనుమంతులు ప్రవేశించుచున్నారు.)

సుగ్రీ—అమాత్యవర్యా! రక్షోగణంబుల శిక్షింప దక్షత్వంబున వరిగిన మనసైన్యంబుల స్థితి యెట్లున్నది?

హను—రాజేంద్రా! అసమానపరాక్రమశాలులగు నలనీలాంగద జాంబవత్సుషేణాదివీరయోధాధిష్ఠితంబులగు మనసైన్యంబులస్థితి నడుగనేల? ప్రచండమార్తాండకిరణ జ్వాలాసమూహంబునఁబడియుఱ్ఱులుగిఁ గహ్వారంబులఁ జొఱఁబారుకరణి రక్షోవ్రాతంబును పిక్కబలంబు జూపనొనర్చుచున్నది.

సుగ్రీ—సరియే, రక్షోనాయకు సైన్యంబులింకెన్ని యుండును. పోరీదినంబుతో వీఁడిపోవునా?

హను—దేవా! పోరీదినంబుతోడ కడముట్టునని యే నేఁదలంచుచున్నాఁడను. దైవాజ్ఞ యెట్లున్నదో?

సుగ్రీ—మారుతీ! అదియేమో కాని నేటిప్రాతఃకాలమునుండియు విభీషణుఁడు యెచ్చటనుఁ గనుపించకయున్నవాఁడు. కారణమేమై యుండును. కనికరించి సహోదరుపక్షంబు చేరియుండఁడుగదా?

హను—రాజా! నేటియుదయమారంభముగ రావణానుజుఁడు సంగరం బెడతెరిపిలేక సలుపుచున్నాఁడు. ఆకారణమున మీకగపడలేదు. కాని యతఁడెల్లన్నటికిని సలుపఁడు. అతఁడు సత్పథవర్తి. సత్యవాక్యానులాపి, వానివిషయంబున దేవరయనుమానింపఁదగదు. (తెరవంకఁజూచి) దేవా!

చం॥ కనుమదె నీలునంగదుని గ్రన్నన దోడ్కొని వచ్చు కైకసీ
తనయుని, రామచంద్రపదతామరసంబులు గొల్చువాని మా
మునఁ జిరుచెమ్మటల్ బొడమ పూనికమై నరుదెంచు నావిభీ
షణుని వలీముఖాధిపచంద్రమ! సాంద్రయశస్కరీంద్రమా!

(పైనఁ జెప్పిన ప్రకారము నీలాంగదులతో విభీషణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విభీ—(ప్రవేశించి)

ఉ॥ వందనమయ్య సూర్యసుత! వందనమో పవనాత్మజా! యికే
మందును దుష్టరావణుని యాత్మగలట్టి దురూహలెల్లనై
డెందముగల్చుచుండె! నిఁక డెప్పరమౌ మనవీర్యమెల్ల కా
వందగు తెన్నుఁ జూడుడు కృపాపరులన్ రఘువంశసోములన్॥

సుగ్రీ—అంజనీపుత్రా! ఏమిది! ఈ దానవనాథుఁడిట్లు బెగ్గడిల్లుచున్నాఁడు. శత్రుసైన్యంబులు విజృంభించియుండునా?

హను—ఓయీ! దానవనాథా! ఏమి? యిట్లు భీతిల్లెదవు. నీయార్తి నెఱింగింపుము?

అంగ—హనుమంతా! ఈతఁడేదియో సంగతి చెప్పెదనని మమ్మిట్లీడ్చుకొని వచ్చినాఁడు.

విభీ—కపిపుంగవులారా!

తే. గీ. ధరణి విశ్రవసుండను దనరునొకఁడు
వానికిన్ గల్గె కైకసివలన ముగురు
పుత్రికులు వారిలోపల మొదటివాఁడు
రాక్షసాధీశ్వరుండగు రావణుండు.

అతండు దుష్టుండై కాంతారంబున కాంతాసహితంబుగనున్న రాఘవులమోసపుచ్చి జనకభూనాయకకుమారీరత్నంబునకుఁ గల కీర్తి

వచ్చియున్నప్పుడు మీరందఱెఱింగినదే కదా? ఇప్పుడా దుష్టుండు క్రూర కృత్యంబుల తనకు పీనంబైనను తగ్గిపోవనట్టి పాతాళ లంకాధిపుఁడగు మైరావణుని బలిది క్రమంబుగ సంగతినంతయు నెఱింగించి,

తే. గీ. మాయరామలక్ష్మణులను మనుజపతులు
వానరులఁగూడి నాలంక వార్ధిముంచ
బింకమున వచ్చి నదురును బెదరుఁ గొనక
హితులతోఁ గూడఁ గూల్చిరి సుతులనెల్ల,

ఇంక నీదినంబునో నన్నును యమపురంబున కంపుదురు. కాపాడవే యని వేఁడ యా రసాతలాధిపుండట్లె యని బాస చేసి భూనభోంతరాళంబులు బెగ్గడిల్ల భీకరార్భటులొనర్చుచు మాసోదరునియొద్ద శెలవుపుచ్చుకొని తన పురంబు—— ఆదుష్టరాక్షసుండు నేఁడు రేపట రామలక్ష్మణులఁ గొనిపోవును. ఇనకులం బంతరింపఁ జేయును, కావున వారి కాపాడు తెన్ను వాలోచింపుఁడు.

హను—ఏమేమీ! రాక్షసు లెంత లేసికృత్యంబులఁ జేయ సాహసించుచున్నారు! నీసోదరుఁడు వేఁడికొనుటయు, వేరొక్కఁడు భానుకులోత్తముల హరించుటయు యింతటితో యినకులం బస్తమింపఁ జేయుటయు, సంభవించునా? కల్లకల్ల! రామునకు నమ్మినబంటగు వాయునందనుఁడు జీవాధిష్టితుఁడై యుండ నట్లెన్నటికిజరుగదని నమ్ముము.

శా. రాసీమత్సటు బాహువిక్రమకళా రాజద్గదా సంహతిన్
వానిన్ ధారుణిద్రొక్కచే యగల నెవ్వండడ్డమై నిల్చినన్
కానల్ గాల్చెడి కారుచిచ్చువగిదిన్ గంధేభయూథంబుపై
మేనెల్లన్ పులకింప దూకుమృగరాడ్విభ్రమ ప్రోతాపోన్నతిన్.

మఱియు నో విభీషణా!

తే. గీ. వాయుసుతు తోడనున్న నెవ్వారినైన
తేఱిచూడఁగలేరు యాదితులేని

అట్టి కౌణపరక్కసు లిట్లు దయాంజనేయు
నత్యుగ్రంబు మారియుండవ నేర్చువారు.

విభీ—మారుతిపుత్రా! నీబలధైర్యస్థైర్యంబులు నేనెఱింగియు
యాశ్రమయంబున మఱలేని పిరికితనంబు వహింపవలసె. ఏలనన ?

ఉ. మాయలె కూడుగాఁగతన మాయలెతన్నుఁగ నెల్లవేళలన్
కాయక కాచుచుండకను పాపపుకార్యములందు మేటులై
సాయము సేయు వాశికుఁడు సాహసవంతర వాలిశారదుల్
మాయురె యాసరాంతకుని మాయలమారినిఁ బట్టశక్యమే.

అమత్తచిత్తుఁడు పోర తనమాయలు ప్రయోగించునే కాని ముఖాముఖ
పోరాఁడఁ జాలఁడు. అట్టివానిని వాసోదరుంను పిలిచి దశరథ రాజసూ
నుల నిశాచరకోటి కిలవేల్పగు యాదిశక్తికి బలిపెట్టఁగోరె. అతఁడు
పాతాళలంకాధి నాథుండగు మైరావణుండనువాఁడు. కడుంగడు క్రో
రుఁడు హస్తంబగ్ని జ్వాలల నెగిలినవెనుక వత్రింబులకై వెదకికొనిన
ప్రయోజనంబు శూన్యంబు. కావున రఘుకులజులఁ గాపాడు విధంబూ
హింపుఁడు.

అంగ—ఓయీ! విభీషణా! ఏల యీలీల బేలవిధంబున బలి
దవు. నేచెప్పెద దించుక వినుము.

సీ. చండప్రచండ దోర్దండ మండితుఁడైన
మారుతియగు హనుమంతుఁడుండ
రంగదాహవత లాభంగ విక్రమమున
నిఖిల యోధులగూల్చు నీలుడుండ
సంగరరంగమున్ సవ్యాజివినినంత
పొంగుచుండెడి సూర్య పుత్రుఁడుండ
రావణులోక విద్రావణుఁగొట్టిన
శ్లోకుఁడైతను వాలి సుతుఁడు దిటుండ

తే. గీ. సకలలోకములను జయింపఁజాలినట్టి
వానరానేక వాహిని పరిభృతులుండ
బక్కరక్కసుకై భయమందనేల
తొడగు పిఱికితనాన విభీషణుండ.

సుగ్రీ—కుమారా! అంగదా! మనమెంత బలపరాక్రమసంపన్నులమైనను యెంత తేజోదర్పితులమైనను మాయాబలశోభితులగు పౌలసుదింపుల నిర్జించుట సాధ్యముకాదు. ఏలయన? వంచకులుగావున హీనరూపంబునో, అహీనరూపంబునో దాల్చి, కుజనులైనను, సుజనులైనను, మోసగించెదరు. అట్టి కారణంబొండుకనఁబరచియే తొల్లి దుందుభియను రక్కసుండు నీజనకునకును, నాకును తీరనిపోరుకల్పించె. మారీచుండనువాఁడు రామలక్ష్మణులనుండి జానకి నెడఁబాపె. ఎంత నమ్మకచూపి ప్రవర్తించుచున్నను.

చం. దనుజుల వేశ్యకాంతలను ధర్మవిహీనుల కుత్సితాత్ములన్
వినుధరణీతలంబునను వేయివిధంబుల బాసచేసినన్
మనమున నమ్మరాదు యను మానసముతోడుత వారినెప్పుడున్
గనుచుమెలంగఁ గావలయు కార్యముపట్లను వేరుపట్లనున్.

అదియునుం గాక?

కం. మనపెద్దలు వచియించిరి
మనకుంగానట్టి వేళమార్గము చిక్కుల్
ఘనముగసని కావున విను
తనయా నావాక్యములను దాక్షిణ్యమునన్

ఎట్టులైనను మన భూమానువంశజులఁ గాపాడుట ప్రధానము. కావున మీరందరును నూహించి తోఁచిన యుపాయంబుల బయలుపఱుపుఁడు, తదనంతరంబు తగురీతిఁ బ్రవర్తింపుదము.

అంగ—పితృవ్యా! నాయూహవినుండు. ఆరక్కసుండు వచ్చు మార్గంబునఁ గాపుండి చుట్టుముట్టి వానిని కృతాంతునికాంతంబున కతిథిగా నొనరింతము.

నీలు—రాజేంద్రా! మన మిచ్చటనేయుండి యాదానవుం డరుదెంచినంతన పట్టివధింతము.

హను—నాకు మీరట్లొనర్పఁదలంతురో యది యసమ్మతము,

విభీ—నీలాంగదులారా! భుజబలంబునకుఁ దోడు బుద్ధిబలంబు కూడ కలుగవలయును. అది లేనినాఁడు భుజ బలంబువ్యర్థంబయగు. వినలేదా? తొల్లిహిరణ్యాక్ష హిరణ్యకశిపులుభుజబలంబున గర్వించి, బుద్ధిబలహీనులగుట చెడుట.కనుక సంగరంబుదక్క వేరొక్క మార్గంబూహింపుడు. ఏలనన ?

కం. మనయూహంబులఁదాల్చియె
మనలను మోసంబుఁజేయునాయకుఁడగుటన్
యనుమానంబినుమంతయుఁ
గనఁడాతఁడు మనమునందుకపికులతిలకుల్.

కావున వేరొండుపాయ మాలోచింపుఁడు.

సుగ్రీ—విభీషణా! నాకేమియును తోచకున్నది. నీమనంబునకు తోచిన యుపాయంబూహించి మమ్మీ యుద్రవార్ధిదాటింప వాఁడవగుము. దానవుఁడవగు నీవు దానవులగుట్లు తెలిసినవాఁడవగుట నీవే యూహింప వలయుఁగాని మాచేనేమగును?

హను—అయ్యా! విభీషణా!

శా. నానాదేవతలున్ మునీంద్రులును సన్మార్గుల్ తనుంగొల్వఁగా
నానాకార్య విచక్షణుండగుచు నానందంబుతో నుండు యా
శ్రీనారాయణుగాద నెవ్వరుధరిత్రిమండలిన్ కర్తలై
పూనంజాలెడివారు; యాకడలె యామోక్షప్రదున్ జట్టినన్.

కావున మన మా కార్యంబునకు చింతింపకయున్నను, యేదేని నొక తెన్నుగను పట్టకపోదు.

విభీ—(ఆలోచించి) మారుతీ! నాకిప్పుడొక యుపాయము పొడకట్టినది, అది యెద్దియనిన?

తే. గీ. సేనసంతయు నొకచోటఁ జేర్చి; దాని
కెట్టులేచుట్టు ప్రాకారమేర్పరించి
దాన నివసింపఁజేతము దశరథాత్మ
జాలను యుద్ధానమునకునుసుఖముగల్గు.

అట్లు నిర్మించినకోటకు ద్వారం బొండేర్పరచి దాన నీవు కాపుండుము. నేనును, మనసుగ్రీవుండును, దానికి ఘారాతిరిఁగెదము. కాని కోటని ప్పుడే తెరఁగున నిర్మించవలయునో తోఁచకున్నది.

హను—విభీషణా! ఇప్పుడు శిలలతో కోటనిర్మించుట చాల కష్టమగును. కావున నావాలంబుననే కోటనిర్మించెదను.

విభీ—మారుతీ! నీయుపాయము చక్కఁగనున్నది. అయినను నీవు కడుజాగ్రతగ నుండవలయును. ఏలన?

తే. గీ. దనుజులందెల్ల మేటియీ దానవుండు
నంత యేమఱినను జాలు; నంతసమున
కోఁట జొరఁబడిమనకపికోటిఁ దాటి
మనువు వంశాంకురంబులమడయఁజేయు.

హను—సరియే! మీరు మీ ప్రయత్నంబుల నుండుడు. నేనును తగు ప్రయత్నంబున నుండెద.

ఇది ప్రథమాంకము





# మారుతివిజయము

## ద్వితీయాంకము

### రంగము:—అంతఃపురము

మైరా—(ప్రవేశించి తనలో) ఆహా! కాలమాహాత్మ్యము.

చం. అరయఁగ నాదు కార్యముల । కడ్డము రాక హితాళితోఁడ భూ
ధరములప్రక్క మేఘములు । ధారుణిముద్దిడుచోట, నెచ్చటో
సరసతనుండి భూవరుని । సత్యమునిల్పుటకై వనంబులన్
దిరిగెడు రామలక్ష్మణులఁ ద్రెళ్ళఁగఁజేయును ప్రోత్సహించెడే.

బాల్యమునుండియు పగతుండై యెల్లవేళల నాజీవంబులు తొలంగించుటకై ప్రయత్నంబులు సలుపు రావణుఁడు కార్యము శిరంబుపైనఁబడి దరిఁజేరు తెన్నుఁగానక పాదంబులఁబడి దీనాననుండై కాపాడ వేఁడెను. అవును. కాలగతులిట్లేగదా తిరుగుచుండును. సకలలోక జగద్రక్షకుఁడగు శ్రీపతిరఘుపతి యయ్యెనని యెఱింగియు నీ పౌలస్త్యుం డెంతపనిఁజేసె. ఎవ్వారైన సత్పథంబునఁ జనుమని చెప్పిన కాలానలంబుగతి నేత్రంబుల నగ్నికణంబులు రాల్చుచు వానిపైకి దుమికివచ్చును. కాఁబట్టిన కుండేటికి మూడే పాదంబులని నొక్కి వక్కాణించు వారల నెవ్వారేవిధంబున సత్పథసంచారులఁ జేయఁగలరు? విధికృతంబున కెవ్వరుకర్తలు? సకుటుంబ సపరివారసహితంబుగ సంగరరంగంబున భంగపడిన పిదపఁగాని హితుల హితోపదేశంబులు మనంబున కెక్కవు.

సహితంబు వానికి కటువుగ నున్నప్పుడు నాసాహాయ్యము వానికి సుఖప్రదంబగునే? ఏల కాఁగూడదు. పగతురభంగంబు నొందించుట వారికి మనోహ్లాదకరం బౌకదా? (ఆలోచించి) అట్లేలయగును. సాహాయ్యంబు చేసెదనని పల్కియు శత్రుపక్షంబుఁ జేరుమని భీతినొందుదురు కదా? ఈవితర్కమేల? మిన్నకుండెదఁగాక? (ఆలోచించి కోపముతో) ఏమీ? నేనెంత యవివేకంబునఁ బడుచున్నాను, సకలనిశాచరానీకంబునకును పెద్దకాలముమండియు పగతుఁడగు. నాహరిపై కృపదాల్చుచున్నాఁడను. ఇది నావంటి ధీరహృదయులకు దగనిపని. ప్రభాకర, నిశాకర భూమ్యాకాశంబులు సాక్షులుగ నానరహరితోఁ బోరియశంబునంపాదించెదఁ గాక! (ఆలోచించి) వారి నేవిధంబున జయింతును. ససైన్యంబుగఁ బోవుదమన్ననో కాలంబు సమీపించె. ఇంకేమి సేయుదును.—సరియే. ఇట్లు చేసెదఁగాక ? ఓరీ! ఎవడురా అక్కడ. సత్వరమునఁబోయి మాయాన నెఱింగించిఘటకుని దోడ్కొని రమ్ము.

సేవ—చిత్తము (నిష్క్రమించును)

ఘట—(ప్రవేశించి తనలో) ఏలకో! మహారాజుగారు నన్నీనిశీధంబునపిలిపించిరి! కారణమేమై యుండును. నావలననేమైన లోపంబులుజరిగెనా! (ఆలోచించి) జరుగలేదే! ఈమనోభీతియేల? పోయి కనుఁగొనియెదఁగాక. (సమీపించి) మహారాజా! జయముజయము దేవా! నన్నీనిశీధంబునఁ బిలిపించిన కార్యమేమి?

మైరా—ఘటకా! చెప్పెదను వినుము. మాయలమారియగు గరుడవాహనుఁడు రామనామంబున నయోధ్యాపురంబున జన్మించి కొండొకకారణంబున వారాశిదాఁటి రావణాసురు పుత్రమిత్రవాహినీ సహితంబుగఁ గూల్పనాతఁడు తన్ను కాపాడుమనినన్ను వేడెను. అందులకు సమ్మతించి నేసభయంబొసంగి వచ్చితికాన నారాముని షా

దరసహితంబుగ వధింపవలయు. నీవువారాసి వఙ్జునున్నవారి సేననుస
మీూపించి రామలక్ష్మణులనుపట్టి తెచ్చు విధంబాలోచించి వీరైనతో
డ్కొని రమ్ము.

ఘట—దేవా! చిత్తము. (నిష్క్రమించును.)

మాతం—(ప్రవేశించి తనలో) అక్కటా! క్షణమైనను నన్ను
విడనాడి వేరొకచోటనుండ నొల్లనిమన్నాథుండేలకో నాథవనంబునకరు
దేరక రహస్యగృహంబున నున్నవాఁడు, నాయెడ తప్పులేమయినంగ
ల్గెనా! ఏమియును లేవే! లేకయుండిన యతఁడిట్లేలరాకయుండును. తో
డిసతులెవ్వరేని లేనిపోని కొండెంబులు చెప్పి కాంతుని మనంబులోఁబర
చుకొని యుందురా? ఈరాజసతులందంత ప్రజ్ఞావతిలేదే? ఇఁక కార
ణమేమై యుండును. శత్రువులెవ్వరైనను కోటముట్టడించి యుందురను
కొందమన్న భేరీనాదంబులు వినఁబడవే! నాకేమియుఁ దోచకున్నది. స
మీూపించి సంగతిని గ్రహింపెదఁగాక! (సమీూపంబున కరిగి) వలకో వీరి
మనంబిట్లు దీర్ఘాలోచనాయత్తంబైనది. ఎదుటనున్న వారినైనను గ్ర
హింపరైరి. పలుకరింపెదఁగాక! నాథా!

మైరా—తరుణీమణీ! అంతఃపురంబును వీడియానిభృతసమయం
బుననొంటరిగ నీవరుదేరకతంబేమి? నీకు సేమంబేకద?

మాతం—దేవా! దేవరపరిపాలన మందున్నవారలకు సేమంబు
కలుగకుండునే! అట్టియెడ నర్థాంగినగు నాసేమంబున కేమికొఱత! దే
వర యేలనోనేఁడు దీర్ఘాలోచనాపరులై గృహంబునకే యరుదేరరైరి.
కారణం బెఱిఁగింపఁదగునేని యెఱింగింపఁగోరుచున్నాను.

మైరా—సుందరీ! ఎఱింగింపరానిదేమి! చెప్పెదవినుము. నేఁడు
లంకాధినాథుండగు రావణుఁడు నన్నుబిలచి కొన్నిరహస్యంబు లెఱిం
గించె! అవినేనెట్లు నెఱవేర్తునాయని యాలోచనా మగ్నుండనై కా
లంబుఁ దెలియనైతి. కాని.

సీ. పున్నమచందు్రిఁజేకన్నుమిన్న మొగంబు
కాంచిచింతిలిచేరెఁగ గనపధము
తమ్ముఁ లేనాటి నేత్రమ్ము లంగని చింత
నైవఁసాలకజలస్థానమందె;
మృదుమృణాళంబులే మెలఁత బాహులఁగాంచి
పంకంబుఁజేరితిప్పలను బొందె;
చక్రంబు లేనాటిచంద్రోయిఁగని యార్తి
మితిలేని చీకట్ల వెతలఁబొందు,
తే. గీ. కోయిలలు కూయమానెనే కోమలాంగి
కింతరుతమును విని;యించగతి దొలంగె
సకియ యే నాటినడకల సోరుఁజూచి.
రమణి! యద్దాని విడెదు దౌర్భాగ్యుఁ డెవఁడు.

మఱియు.

మ. కలికీ! నీదుముఖాంబుజంబుగన కేకందో్యి వాల్గాపులన్
కళలన్ గాంచక నీదు మోవిసుధగో్రల్ లేక పీకొఁగిటన్
మెలఁగన్ బాసిన ప్రాణముల్ నిలతునా మేల్ దివ్యులన్ గెల్తునా.
జలజాతాక్షిరో యట్టినిన్ను విడనాజన్మం బికంగాల్పనా.

మాతం—ప్రాణేశ్వరా! ఆరహాస్యంబు లెవ్వి యో నా కెఱింగింపరా! పతులకు సతులర్ధాంగులు గదా?

మైరా—ప్రాణేశ్వరీ! నీ కెఱింగింప కేమి ? చెప్పెదను వినుము ఎఱుఁగుదువుక దా కోసలదేశము దానికి ప్రభువు శ్రీరామనాముండగు నొక్కమానవుండు, అతఁడు. కొండొక కారణంబున జనకునియాజ్ఞచొప్పున చిరకాలంబునుండియు మనవంశీయులకు వాసయోగ్యంబగు దండగారణ్యంబు ప్రవేశించి తుచ్ఛులగు మునులచేఁ బూజింపఁబడి రాక్ష

పత్రిణిని సురుమాఘుచుండ లంకాధినాధుండగు రావణుండు యాతని సతిని యాతండు లేని సమయంబున లంకాపురంబునకుం గొని తెచ్చెను.

మాతం—ఛీ! ఛీ! ఎంత నీచత్వంబున కొడిగట్టినాఁడు. సకలరజనీచరవ్రికరంబునకు నియామకుండయ్యు నిట్టితుచ్ఛకార్యంబునకు లోఁబడియెనా? అటుపిమ్మట నేమిజరిగినది?

మైరా—తరుణీ! అట్లాతఁడా కాంతంగొని తేర రాముండు పర్ణశాల కరుదెంచి కులసతి జాడలేకుండుటకు దుఃఖించి ఖగమృగాదుల వలన జానకి జాడ నెఱింగి, ఋశ్యమూకాద్రి సమీపించి సోదరద్రోహియగు వానరనాథు నొక్కమ్మనఁ గూలనేసి యాతని సోదరుని సాహాయ్యంబున జానకి జాడ నెఱుంగ కపుల నలుదెసల కంపె, అందుదక్షిణదిక్కునకు వచ్చినవానర్లు జానకి సంగతినంతయు నెఱింగి యారామున కెఱింగింప కోతులసాయంబున యాతఁడు సముద్రంబు దాఁటి రావణుని పుత్ర మిత్రామాత్యసైనిక నికాయంబులనెల్ల రణరంగంబునఁ గూల్చె.

మాతం—అవును. కులసతుల చెరబట్టిన వారలెవ్వరు బాగుపడిరి. మహారణ్యమధ్యంబున నాథునింబాసి యల్లాడు దమయంతివలన కిరాతునకుఁ గల్గినగతియే యిప్పుడు వీనికిఁగలిగినది. నాథా! అట్లయిన నాతఁడు మిమ్మేల పిలువవలయును.

మైరా—రమణీ! అట్లాతఁడు భీకరంబుగ సంగ్రామం బొనర్పుచుండ తనచావు నిక్కంబనినమ్మి యెట్లయినను యానరుని బాఱినుండి తన్నురక్షింపుమని నాపాదముల మీఁదఁబడి వేఁడికొనియెను.

మాతం—నాథా! అందుకు మీరేమిచేయుదురు. "బుద్ధిః కర్మానుసారిణీ" యను నార్యోక్తి రిత్తయగునా! మఱియును చిరుతప్రాయమునుండియు యాతండు మీకుసగతుఁడని కొండొక కాలంబున నాకెఱింగించితిరి. యట్టియాతండు మీసాయంబు కోరెనా?

మైరా—ప్రాణేశ్వరీ! అవసరంబగు నేని సర్వజీవులును కాలా నుసరణంబుగ పగదిగనాడే స్నేహంబునకును స్నేహంబును విడనాడి విరోధంబునకును దిగుచుందురు. అట్లే యాతండును యవసరంబు ననుసరించి మిత్రత్వంబునకు వచ్చెను

మాతం—సరియే! అందుకు మీరేమంటిరి?

మైరా—మానవతీ! ఎంతటి జేలవు. జన్మించినది సుక్షత్రియకులంబని యెఱుంగవో? కష్టదశయందెవ్వరేనివచ్చి కాళ్ళమీఁదఁ బడి రక్షింపవేఁడిన కరంబున కలవాలధనుర్బాణంబులు ధరించువాఁడెవ్వండైనను పేరొందు విధంబునఁ బల్కునే! అందునను.

తే. గీ. పగతుఁడేవచ్చి శరణంచు పదములపయిఁ
బడిన రక్షింపకుండుట భావ్యమగునె?
కానవానినిఁ గావంగ కంకణంబు
దాల్చినాఁడ నేనిప్పుడు తరుణిమిన్న.

కావున నెట్లయిన నావౌలస్త్యునిఁ గాపాడెద. యశంబు నార్జించెద.

మాతం—నాథా! అకారణంబుగ మీకీ పోరేల? దుష్టుఁడైన రావణుఁడు తనసతిని తెచ్చెనను కోపంబున యాతండు వానిని పుత్ర మిత్రామాత్యులతోఁడ చంపఁ దలపెట్టెఁగాని యాతం డకారణంబుగ వానిని వధింపఁ దలపడియెనా? నామాటవినుఁడు. ఇప్పుడు పగులకు క్రోహంబుఁదలఁచిన యాతఁడు రేపు మనకుఁ దలపెట్టవచ్చును. కావున మీరు వానినికాచు ప్రయత్నంబును వీడుఁడు. మఱియును మీరారాముని మానవమాత్రుండనియు సూర్యకులంబున నుదయించిన రాజమాత్రుండనియుఁ దలంపకుఁడు. వలనన

తే. గీ. రఘువువంశమునందు నారణ్యకుండు
యనెడు పేరున నొకరేఁడు తనదెమునుపు;

వా.సిపైదండు వెడలి రావణుఁడు పరిభ
వాధించెను; యది యోర్వక తఁడు వాధ.

ఓరీ! దుష్టచిత్తా! రావణా! వృద్ధుఁడనగు నన్నింత దుఃఖము పాలుచేసితివి. కాన దుష్టశిక్షకుండగు శ్రీమన్నారాయణుఁడు నాకులంబునజన్మించి నాకు నీవొనర్చిన పరిభవముఁదీర్పుఁగాక! అనిశపించి ప్రాణంబులవీడెను. ఆవృద్ధుని పలుకులచొప్పున శ్రీమన్నారాయణుఁడు రాముఁడై యవతరించెనని నారదాదిమునులవలన వినియుంటిని. కావున నోప్రియా! మీరా రామునితో పగపూనకుఁడు.

మైరా—బాలా! ఏలయీలీల వాపోయెదవు. తిట్లకుచచ్చువారునుగలరా? ఆవిధి తిట్లకేచచ్చునెడల రావణుండిదివరకే లేకుండును. ఇదివరకెందరుమునులు వానినిశపించి యుండలేదు. వేదవతి యను తరుణియెంతగ దూషించియుండలేదు. తరుణీ! ఇట్టితిట్లకు బెదరిన నింకేమి కావలయును. భయఁపడక మిన్నకుండుము.

మాతం—నాథా! ఇప్పుడా వేదవతియే సీతయనుపేరజన్మించి రావణునిచేఁ జిక్కియున్నది. ఆకోపకతంబుననే రావణునకింత ప్రాప్తమైనది. మిన్నకుందునా? ఎట్లు మిన్నకుందును. మానవతులు భర్తల కర్థశరీరులుగదా! పతులకాపదలు సంప్రాప్తమైన వారలకు మాత్రము కావా? ప్రాణేశ్వరా! ఆరాముఁడు సకలలోకరక్షకుఁడగు లక్ష్మీపతి గాని మానవమాత్రుఁడు కాఁడు, ఆరంగనాయకుఁడు.

సీ. విద్యలనెత్తుక వెడలు సోమకుఁబట్టి;
సంద్రంబునందునఁ జంపినాఁడు;
పాలసంద్రముఁ ద్రచ్చువేళఁ గాపాడెను
రాక్షస దేవతా రాజవరుల;
ధరణినెత్తుకపోవు దానవునిం బట్టి
యమునిగృహంబున కనిపినాఁడు;

కన్నతాపసుని బల్మికడగండ్ల ముంచెను
కనకకశిపుఁబట్టి కాల్చినాఁడు;
దేవావళినిఁగొట్టి దేవరాజగు బలిన్
పాతాళసీమకుఁ బంపినాఁడు;
కడుగర్వమునమిట్టి పడెడు రాజులఁబట్టి
చంపె నిర్వదియొక్కసార్లు కడిమిఁ;
తే. గీ. రాజమాత్రుండె శ్రీరఘురామమూర్తి
వనదలిర్పఁగ దుష్టరాక్షసులఁ గూల్చ
జననమందిన వైకుంఠ చక్రవర్తి
శ్రీమన్నాథుఁడని యెంచు చిత్తమందు.

మఱియు నీరూపంబున విశ్వామిత్ర సవనరక్షణార్థమరుగుచు మార్గ మధ్యమున తాటకయను నిశాటి నొక్క కోలం గూలనేసి సవనవాటి కంజేరి తాటకకు ముద్దులసూనుండగుసుబాహునొక్క కోలచే విగత ప్రాణునిఁ జేసి మారీచుని వారాసిమధ్యంబున పడఁద్రోచె. పిదప సర్వ సర్వంసహా చక్రంబునఁగల చక్రవర్తులెల్లరును వ్రేలెఁడైనను కదలింప జాలని శివుని కార్ముకంబవలీల గాఁద్రుంచి జానకినిఁ బెండ్లియాడె. కావున నో నాథా! ఈదాసురాలిపలుకు లాలకించి యనంతకోట్యవతార ధరుండగు పుండరీకాక్షునితో పగఁబూఁజోరకుఁడు. నెయ్యంబు నెఱపుఁడు.

మైరా — కురంగేక్షణా! ఏలయిట్లు భీతిల్లెదవు. క్షుద్రుండగు విష్ణుండొక్క దేవుఁడా! బళే! చంచలాంగీ! ఎంతమాటంటివి. సుక్షత్రియంబగు వంశంబున జన్మించియు భీరజనసులభంబగు నధైర్యమును బొందితివే? చాలు! చాలు! ఎచ్చటనో ఏమూలనో పోటుదనంబిసుమంతయులేక దొంగతనంబున బక్కరక్కసి మూఁకలఁదునుమాడినమా

త్రిభువన నిల్లధైర్యవడి యాతుధానునితో పోరఁదగదని పల్కఁజెల్లునే! అదియునుంగాక! ఆతండు సీతలంచినట్లు యథమాధముండగు మాధవుండేయయిన.

మ. తలపన్ పూర్వమునుండి రాక్షసులకున్ దర్పంబుమైనా వదల్
కలుగం జేసినయట్టి దుష్టనిజనున్ కాంతామణీ! పోరిలో
నిలపై ద్రొళ్ళఁగఁజేసి కీర్తిఁ గానవర నీవెట్లు నాపోవకే
చెలులంగూడియు సంతసంబుఁగను మా చింతింపక శాంతమ్ముగ

మారుతం — నాథా! ఏటికీబింకములు. సర్వలోకరక్షకుఁడగు నా శ్రియఃపతిని గెలువమీశరమా? సురాసురయక్ష పన్నగసిద్ధసాధ్యాదినిఖిల ఖేచరులును యాజగద్రక్షకునిఁ గెలువలేక యాతనిపదంబుల శాంతంబునఁ గొల్చుచుందురు. ఆవారినే యనసేల? వారిబంటులగు వానరులనైనను గెలువఁగలరా! అందు సమీరకుమారునిఁ గెలువనెవరితరమగు? ఆవాయుపుత్రునితోఁడ పోరఁలేక యెందరెందరో దనుజులు విగతప్రాణులైరి. చూడుఁడు.

సీ. కపటంపు జడదారిగా మారివచ్చినే
కాలునిఁ జేరడే కాలనేమి;
సురలనోడించిన శూరుండు మాల్యవం
తుండుకూలఁడె తాను ఖండవమువ?
రణకేళిలోఁ కీర్తిఁ గనిగర్వమ్ముగ జెందు
జంబుమాలులెల్లరు సమసిపోర!
సంజీవగిరికైన సాహసంబునఁ బోరు
చిత్రసేనాదుల చెట్టవిననా!
తే-గీ॥ అక్షధూమ్రాక్ష దేవాంతకాదులెల్ల
ఖడ్గపాటులనెఱుఁగవే భావమందు

వారికంటెను ఘనుఁడవె ప్రాణనాథ!
వలదు వగ వారితోఁడను తలఁపమనకు॥

మఱియును పవనాత్మజుఁడు బాల్యమున,

చం॥ ఉదయధరాధరేంద్రమున నుద్భవమందెను పూషుగాంచి స
మ్మదమొనగూర్పగా దివిజముఖ్యుఁడు నాకుభుజింపబంపుమా
ల్యదఫలశ్రేష్ఠమంచు మదిరానవమత్తకరీంద్రభాతి బ
ల్లిదుఁడయి మింటికేగి కబళింపఁగడంగెడినట్టివేళలన్॥

ఈసమాచారము వేగులవలన నాకాధీసుండు విని జగత్సంక్షోభభ యంబున పాదంబులపైఁబడి వేఁడ యాయుహార్పతిని విడచెను. అట్టిధీరు నిఁ గెలువ నీకు సాధ్యమగునా?

మైం—సుకుమారీ! మారుతి యసామాన్యపరాక్రమవంతుఁడా! నేను పిఱికివాఁడను గాఁబోలును. అవును. ఇట్టిపోగడ్తలకెల్ల తొలుత మీస్త్రీజాతినే చెప్పవలయును. ఏలనన,

చం॥ అనుపమవిక్రమక్రమము ప్రాణవిభుండు ధరిత్రినిల్పినన్
వనితలముందువారలప్రభావము శూన్యమెయౌనటంచు బ
ల్కినమనశాస్త్రకోవిదుల కేవలధర్మమురిత్తబుచ్చకే
ఘనముగ నిల్పితీవు పెరపూరుషులధర్మముగొప్పచేయుచున్,

మఱియు నో కాంతా! నేనొక్కమాట చెప్పెదను. వాపోవక వినుము. నేను,

ఉ॥ తొలితినష్టదిక్పతులతోఁడ శచీపతికానలందు కూ్రి
రాళిని నుక్కడంచినసమరావనికీర్తిఁగడించినాఁడ నో
బాల తలంప నాకుసమబాహుబలాఢ్యులు ధాత్రిలేరు నీ
వేల భయంబునొందెదవు నీమది నీవిధి పద్మలోచనా॥

ఇట్టిపరాక్రమశాలినిగెలువ నావలీముఖంబున కగునా? ఈవలీముఖ

మొక్కండగాదు త్రింశత్కోటిదేవగణంబులఁ జానటఁ గొని యా పార్వతీనాథుండు ప్రమథగణంబులతో నరుదెంచినను పిరుతివియక వారినెల్లర కృతాంతునిశాంతమువ కతిథులుగ నొనర్పనే! నీవిట్లుభయ పడదవేల?

మారుతం—ప్రాణేశ్వరా! ఆపవననందనుఁడు వానరుండని మీ మనంబునఁ దలఁచితిరిగాఁబోలును. ఎవ్వాఁడు సురాసురు లమృతంబు కొఱకు పాలసంద్రంబు తరచువేళ లోకంబుల భస్మంబుచేయ నుద్భ వించిన కాలకూటవిషంబుగ్రోలి దేవాసురులఁ గాపాడెనో, ఎవ్వాఁడు మేరుమహీధరంబు చాపంబుగఁ దాల్చి త్రిపురంబుల భస్మీపటలంబొ నర్చి విబుధానీకంబుల బన్నంబులు తొలఁగఁజేసెనో, ఎవ్వాఁడు మా ర్కండేయాదిభక్తులపాలిటి కల్పమహీరుహంబో, ఎవ్వాఁడు సతీమణి కర్ధశరీరంబిచ్చి యర్ధనారీశ్వరుండను సార్థకనామముధరించెనో, ఆగరళ కంఠుండు, ఆత్రిపురాంతకుఁడు, ఆ యోంకారస్వరూపుఁడు, ఆచంద్ర శేఖరుఁడు, భూనివాసులను బ్రోచుటకు గోలాంగూలరూపంబున పు ట్టువాండి, సకలరాక్షసవిరాముండగు రామునకు బంటుగతి సాయంబొ నరించుచుండె. కావున,

తే-గీ॥ పలుకులవి వేయ నేలనోప్రాణనాథ
గాలికొమరునితోఁ బోరగడఁగుటెల్ల
యమునిసదనంబొ స్వర్గంబొ యఱయుకొఱకె
యింతియే నిశ్చయంబని యెంచుమదిని॥

మైరా—కాంతా! ఇంక నీయుపన్యాసములు చాలించి నాచె ప్పునది యించుక వినుము.

సీ॥ ఇలనిశాచరవంశములు దగ్ధముగసల్పు
కూళలఁగూల్పగాఁ గూడదొక్క

అనయంబు శక్తిపూజనము మాన్పయత్నించు
కుటిలులఁ జంపఁగాఁ గూడదొకొ
మనవాసములనుండి మనకొగ్గుఁ దలఁచెడి
మునులహింసింపఁగాఁ బోలదొకొ
మనవంశముల పేరు వినుమాత్రమునమండు
వారితోఁ బోరాట వలవదొకొ
తే-గీ॥ తెల్పవూ వేఱుమార్గంబు దెలిసియున్న
కామినీమణి! నే నిన్నుఁ గాదటంచు
బూకరింపను యువియున్ని బుద్ధినెఱిఁగి
కలహమూర్కొనల్ప మనమునఁ దలఁచినాఁడ॥

నేనంత వెఱ్ఱినని తలపోసినదానవు గాఁబోలును. అదియునుంగాక నిశా చరవంశంబున జన్మించి లోకభయంకరుండనని పేరుధరించిన నే నభ యం బిచ్చియు తిరుగుదునే? చచ్చిన రణరంగంబున చచ్చెదఁ గాక. హీ నులగతి మెలంగఁజాల! ఆరాఘవునిచే కాపాడఁగలిగితినేని పృథ్వీతలంబున నీలోకంబునను, యటులొనర్పఁజాలనేని పరలోకంబున స్వర్గలోకంబున ను సుఖంబు కలుగును. కావున వానితోఁడ రణంబొనరించితీరెద. కు రంగేక్షణా! భయపడక లోపలిసౌధంబున కరుగుము. నేనత్వరంబున నా కార్యంబుల నిర్వహింప వరిగెద. మారుపలికిన నాయానసుమీ!

మాతం—నాథా! నామాటలాలకించరా? న న్నానాథ జేయఁ దలపోసితిరా? ఆజగద్రక్షకునితోడ వైరంబు తగదని చెప్పిన వినరయి తిరే? నేనేమిచేయుదును? ఎందుఁ జొత్తును! ప్రియురాల నగునామాట ద్రోసివైతురా? (తనలో) అయ్యో! నేనింకేమి సేయుదును? ప్రియుండు తగదనిన కార్యమునే సలుపఁ బూనుకొనియె. చెప్పిన వినరైరి. కాన, నాయిష్టదైవములను నాప్రాణేశ్వరున కేకీడును కలుగకుండ ప్రార్థించె దఁగాక!

సీ॥ మునులార! స్వర్లోకమునులార! ఘనులార!
కావ రేనానాథు కరుణతోడ
సురలార! ధారుణీసురులార! తరులార!
కావ రేనానాథు కరుణతోడ
కవులార! కరటిపుంగవులార! కపులార!
కావ రేనానాథు కరుణతోడ
వనులార! చిలుకజవ్వనులార! యినులార!
కావ రేనానాథు కరుణతోడ
తే_గీ॥ యక్షులార! బలప్రభాద్యక్షులార!
గరుడగంధర్వకిన్నరపురుషులార!
కావ్రఁడీ నాదునాథుని కరుణతోడ
మీకుమారులఁబోలెడు రాకుమారు॥

మీమీద భారము వైచియున్న యీదీనురాలిని రక్షింపుఁడు. నేసిదె పోవుదానను. (నిష్క్రమించును.)

మైరా—(తనలో) ఏమి చెప్పవమా! నామంత్రియగు ఘటకర్ణుఁడింకను రాకున్నవాఁడు. కారణ మేమైయుండును! కపులమధ్య నున్నవారల బట్టుకొనిరాఁగ నుపాయంబుఁగానక తడయుచున్నవాఁ డేమో? లేకయుండిన నింత సేపేలరాకయుండును? (ఆలోచించుచుండును.)

సేవ—(ప్రవేశించి) రాజేంద్రా! దేవరదర్శనార్థమై ఘటకర్ణుఁడు ద్వారముకడ వేచియున్నాఁడు. దేవరయాజ్ఞయేమి?

మైరా—సత్వరము ప్రవేశపెట్టుము.

సేవ—చిత్తము. (నిష్క్రమింప ఘటకర్ణుఁడు ప్రవేశించును.)

మైరా—అమాత్యవర్యా! కార్యము సానుకూలంబయ్యెనా?

ఘట—దేవా! ఏమని చెప్పుదును. అట్లు మీచే నాజ్ఞాపింపఁబ

డి దక్షిణసముద్రతీరంబున కరిగి యచ్చట నెవ్వరును లేమి యాశ్చర్యమగ్నమానసుండనై యటునిటు దిలకించుచుండ నెవ్వఁడును నచ్చట కనివినియెఱుంగని దుర్గం బొక్కటి కానరా దానియందు వానరులుందురని యూహించి దానిం బ్రవేశించి కార్యంబు నెఱవేర్పఁబ్రయత్నించి చేతఁగాక —

మైరా — ఛీ! దురాత్మా! సిగ్గులేక నేవిధంబున తలయెత్తుకొని చేతఁగాక వచ్చితినని తెలుపవచ్చితివి. హీనా! ముక్కిడిమానవుల నిరువురను బట్టుకొని రాఁజాలకపోయితివి. పరసేనలకు స్వప్నగతసింహమనఁగు నాకుఁగూడ నీకతంబున నపకీర్తి గలిగెనే! ఛీ! ఇంక నాకన్నులయెదుటనుండక పొమ్ము.

ఘట — (తనలో) ఇఁక నిచ్చటనుండిన నాచావు నిశ్చయముగు. కనుక యిప్పటి కిచ్చటనుండక కోపవిముక్తుండయినపిదప యరుదెంచెదఁగాక! (నిష్క్రమించును)

మైరా — (కోపముతో)

శా॥ అక్షుద్రప్రతిభాప్రభావుఁడగు నాకాధ్యక్షుఁడే యడ్డినన్
పక్షంబుల్ దెగి భూమిఁబడ్డశిఖరుల్ ప్రాగ్ర్యఖరిన్ లేచి తా
మక్షీణప్రభతో నెదిర్చినను నేనా సూర్యవంశీయులన్
దక్షత్వంబునఁద్రుంచువాఁడ మదిలో దాక్షిణ్యముల్ పూనకే॥

నేనిదేపోయి యారాచకుమారులను బట్టితెచ్చి మిత్రునికోర్కె నెరవేర్ప భద్రకాళికి బలినొసంగెదఁగాక!

(అని నిష్క్రమించును)

ఇది ద్వితీయాంకము.





# మారుతివిజయము.

## తృతీయాంకము.

### ప్రథమరంగము—అరణ్యము.

(హనుమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

హను—(తనలో)

సీ॥ హా! రామ! కౌశికయజ్ఞనిర్వాహకా
హా సూర్యకులచంద్ర యనుపమబల
హా! దైత్యకులకాల! హా! మానినీప్రాణ
హా! ధనుర్భంగ! ప్రజ్ఞానిలుండ!
హా! సర్వలోకాశ్రితామృతప్రదహస్త
హా! జానకీమానసాబ్జభృంగ!
హా! భక్తశీల! సంప్రాప్తసంతోషాబ్ధి!
హా! నీలఘనదేహ! హా! శుభాంగ!

తే—గీ॥ మమ్ము నందఱి పోరులో వమ్ము సలిపి
దుష్టరావణు ప్రాణంబుఁ గొనఁడ నునిచి
సోదరునిఁగూడి మాయలఁ జోఁకుమాఁక
మాయలకుఁ జిక్కితే నీవు మాన్యచరిత॥

మఱియును,

శా॥ నీపాదంబుల నెల్లవేళలను దా నమ్మిన్ మహాభక్తితో
పాపారణ్యదవానలంబులని సంభావించుకం జేతుఁగా
ప్రాపై బ్రోవఁగ నెంచివచ్చి యిటులన్ రామా! చనన్ న్యాయమే?
పాపం బెంచుతలంచినాఁడవా మదిన్ భారం బటంచెంచితో॥

సీ॥ రామ! నీవేవచ్చి రక్షింతువంచును
జీవంబులన్ నిల్పె సీతమేన;
భానువంశచంద్ర! నీమన్ననన్ గనఁగోరి
లంకఁబట్టిరి కపుల్ శంక లేక;
కౌసల్యపుత్ర! నిన్ గాంక్షించి సుగ్రీవుఁ
డలఋశ్యమూకాద్రి వెడలివచ్చె;
రఘువంశతిలక! నీప్రాపునలంక నే
లఁగ విభీషణుఁడు దలంచెఁగాదె

తే॥ గీ॥ యట్టిమమ్ముల నందర నట్టనడి స
ముద్రమందున విడియు నిర్నిద్రచరిత!
తగునె! సోదరునిం గూడి వగలఁ బొగలుఁ
డనుచు మమువీడి చనుట రామా యినకులేశ!

ఓ సకలలోకపూజనీయా! రామా! నీకొఱకై సకలనదీనదంబులును, నగరారణ్య పట్టణంబులును, వెదకి వెదకి వేసారితింగాని యింతవఱకు దేవరజాడ నెఱుంగఁజాలనైతిని. ఆముక్కిడిరక్కసుండు మిమ్మెక్కడఁ దాఁచెనో? యెట్టిబాములఁ బెట్టెనో, యని మనం బెంతయు చలింపుచున్నది. నడువ నా దేహంబున ప్రాణంబులు కలవో లేవో నేనెఱుంగను. కంటకతరులమీఁదను, కర్కశశిలావృతంబులగు పర్వతశిఖరంబులమీఁదను, విరామంబిసుమంతయు కోరక యే రేయింబవళులు పర్యటనము సల్పు నాపాదంబులు యీమహారణ్యము ప్రవేశించినది మొదలు భూమిపై మోపనీయకున్నవి. ఆకలి మిక్కుటమగుచున్నది. నేబయలుఁదేరిన

కార్యమునకు హృదయమావేగిరపడుచున్నది. మనశ్చాంచల్యంబున విభీషణోపదేశంబు వెడమార్గమనుసరించె (దారిపరికించి) ఇంతవఱకావిభీషణుఁడెఱిఁగించిన మార్గముననే వచ్చితిని. సాధూ విభీషణా! చెనటిరక్కసులకులంబున జన్మించినను నీకు సత్యమార్గమే యలవడినది. క్రూరుండవనియు, స్వామిద్రోహివనియు, నిన్ను దూలనాడిన వారత్పాలనైరింపుము. నామాటలు నిక్కువంబుగాఁగొని కపులు నిన్నెంత బాధించుచున్నారో? ఆమాయావివలన నీకెంతకష్టముసంప్రాప్తమయ్యెను. ఓగగనసంచారులారా! మీరైన నాయందుదయయుంచి సుగ్రీవాదులకు వినఁబడునట్లు పౌలస్త్యుండగు విభీషణుండు నిరపరాధియనియు, దండార్హుఁడు కాడనియు తెలియఁబఱుపుఁడు. పౌలస్త్యరత్నమా! నీవెఱింగించినమార్గంబుననే యింతవఱకరుదెంచితిగాని గమ్యస్థానమును చేరఁజాలనైతిని. ఇంకెంతదూరమేగవలయునో కదా! (కోపముతో) ఓరీ! దుష్టా! మైరావణా! ఖలుండగువారావణుని ప్రోత్సాహంబున నెంత ద్రోహము తలపెట్టితివిరా! అనంతకోట్యవతారుండై జగద్రక్షకుఁడగు యాశ్రీరామునకపరాధముచేసిన నీప్రాణంబులు నీకుదక్కునా? ప్రచండవైరి వీరభుజాదండోగ్ర నటితజయకాంతాకేశా కర్షణప్రబలప్రతాప మారుత తనూజుండగు హనుమంతుభుజాదండంబున కెఱయగుదువం చెఱుంగవే? ఓలతలారా! సాలములారా! రసాలములారా! మైరావణుఁడుయీమార్గంబున దశరథసుతులను కొనిపోవుచుండ మీరు కనుగొంటిరా? అయ్యో, నాప్రశ్నంబునకీతరులతాదులు ప్రత్యుత్తరంబీయకున్నవే! ఇవి తమ్మాదురాత్ముఁడు నిశితకౌక్షేయకంబున ఖండించునని భయపడుచున్నవి కాఁబోలు. ఈవనమృగంబుల నడిగిచూచెదఁగాక! ఇవియైనను నాకేలప్రత్యుత్తరంబిచ్చురు. నిశితాశుగంబులచే తునుమాడునని యెఱుంగవా! కావున నివియును నాప్రశ్నంబునకుత్తరమీయవు. ఈసత్పథసంచారులైనను రాఘవులపోకడ నెఱింగించెదరే

మా కనుఁగొనదఁగాక! ఓగగనసంచారులారా! కోసలాధీశుతనూజుల మైరావణుండెచ్చోట దాచెనో మీరెఱుంగుదురే? ఏమి! ప్రత్యుత్తరం బొసంగరు, మీరును యాదురాత్మునిదెస భయపడువారలేనా? అయ్యో! నాకెవ్వరును ప్రత్యుత్తరంబొసగరైరే? నేనేమిచేయుదును,

ఉ॥ ఎవ్వరివేఁడువాఁడ నిఁక నెవ్వరి నేఁగతిఁ జేరువాఁడ నా
కెవ్వరు రామలక్ష్మణుల నీధరణీస్థలిఁ జూపువారు; నే
నెవ్విధిసూర్యపుత్త్రకుని యింద్రజసూనునిఁ గాంచువాఁడ; హా!
యివ్వని ప్రాణముల్ విడతు నింకవిధీ! దయఁజూడవేనన్.

ఎంతదూర మరుదెంచినను సరోవరంబుకనఁబడకయున్నది. (ముందుఁ జూచి) అదే అనేక జలజంతుసంతానమండితంబై కమలినీకముల సమ్మిళితలతామతల్లికావిలసితంబై హృదయానందతరంగమాలికా సంశోభితంబై నేత్రానందకరంబై కన్పట్టు కాసారరాజంబు, అల్లదేయాజలరాశిమధ్యంబున గగనపుష్కరిణియందలి కైరవంబునకించుకంతయుఁ దీసిపోవని కైరవంబు. దానిం జొరఁబడియే యనేకభీకరాకారనిశాచరాధిష్ఠితంబగు భోగవతీపురంబు ప్రవేశింపవలయును. కావున సత్వరంబున యీకైరవంబును ప్రవేశించి రాక్షసానీకంబుల దునుమాడి దశరథపుత్రులతోడ లంకాబహిర్ద్వారంబుఁ జేరరాదఁగాక? ఓసూర్యచంద్రులారా! భూమ్యాకాశంబులారా, ఓవసుంధరాదేవీ!

మ॥ ఇనవంశోద్భవులన్ నృపాలవరులన్ హీనంబఁటంచెంచకే
దనుజశ్రేణికొసంగి పిమ్మటనుచింతంబొందు నాకిప్డు ప
జ్జనులా వారలఁబ్రోచుశక్తినిడి వేసాకంగ ప్రార్థింతునో
యినచంద్రుల్! ధర! పంచభూతములు నా యిష్టంబుచేకూర్పుఁడీ.

(నిష్క్రమించును)

---

## ద్వితీయరంగము.

(మత్స్యవల్లభుఁడు ప్రవేశించుచున్నాఁడు)

మత్స్య—(తనలో)

చం॥ జనకునిఁగాంచఁగాఁగలవుసత్వరమీవని తెల్పినన్ను యీ
దనుజుని సేవనుండుమని ధారుణిదేవి వచించియుంట య
ట్లనగదుఁ గాకయుంచు మదిలోపలసంతసమందియుండ నా
జనకునిఁగాంచు భాగ్యమును సంతసమందుటఁ గల్గదయ్యెఁగా.

ఛీ! ఛీ! జనకునిఁగనుఁగొందునని ధారుణి చెప్పుటచే యింత కాలము యీతుచ్ఛునికొలువు చేయుచుంటిని, లేకున్న వీనికొలువునకు సమ్మతింతునా? ఈరాక్షసుఁడు నన్నీకైరవమును గాపాడుచుండనియమించునా? సురాసురులనొక్కక్షణమాత్రంబునభంగంబునొందించుసత్వసంపన్నుండనగునన్నతఁడిట్లు పరిభవించునా? కల్ల? ఇంతేకాక యీతఁడొనర్చు కార్యంబులేవియు నాకు సరిపడకయున్నవి, నిరంతరంబు శక్తిపూజలయందుకాలంబు వెళ్ళఁబుచ్చుటయు సుందరులగు కాంతాలలామంబు లేమొదఁగనుపించిన నాయొడకుదుష్టసమాజంబులతోఁడ నరిగివారిఁజెఱఁబట్టుటయు నిరంతరము భగవద్ధ్యానముసలుపు మానులబాధించుటయు భీరులై దాసోహమ్మని-పాదంబులపైఁబడు రాజన్యుల ప్రచండసైన్యసమేతుండై యరిగిబాధించుచుండుటయు మొదలగుదుష్టచేష్టితంబు లెవ్వారుచూచి సహింపఁగలరు? అదియునుంగాక! ఏదియో కారణంబుఁ గల్పించి.

తే॥ గీ॥ చెలియలకుభర్తయంచని దలఁపకుండ
బావమఱఁదినిఁ దునుమాడె పాపియగుచు
తనతనూజనుఁగోరినాతనుచుభగిని
తనయుకారాగృహంబున నునిచినాఁడు.

(కుడికన్నును ఎడమభుజంబును అదరుటసూచించి) ఏటికో! నాదక్షిణనే
త్రంబును వామభుజంబును యదరుచున్నవి. సంతోషంబును యుద్ధం
బునుఁగలుగునా! సంతోసమా! నిర్భాగ్యుండనగు నాకెట్లుగలుగును.
ఇఁకయుద్ధమా! ఏనాడన్యులసేవకై దేహంబర్పగించితినో యానాడే
సర్వకాలంబులకును సంగ్రామసన్నద్ధుండనైతిని. ఇఁకవేరయుద్ధంబు క
లుగునని హృదయాందోళనంబు బొందవలసిన యగత్యంబుశూన్యంబు
గాదె. (ఆలోచనవభినయించుచుండును)

హను—(ప్రవేశించి తనలో) ఎట్టులో శ్రమఁబడి యాతమ్మిఁ
దరించితినిఁగాని యిసుమంతయైనను లాభంబుకనుపింపకున్నది. ఏలయ
న! యిచ్చటనేక మార్గంబులు కనఁబడుచున్నవి. ఇందేమార్గంబునఁ
బోయిన భోగవతీపురంబుచేరెదనో తెలియకున్నది. ఎవ్వరినేని యడిగి
మార్గంబు కనుఁగొందమన్న నిచ్చటనొక్క మానిసియైనను కానుపిం
పకున్నాఁడు. ఇంకేమిసేయుదును. హా! దైవమా!

ఉ॥ ఎవ్వరివేఁడుకొందు, నిక నేగతిభోగవతీపురంబునేఁ
జివ్వనఁజేరఁగాఁగలను శ్రీపతి నీపదపంకజంబు నేఁ
నెవ్విధిఁగాంచఁగాఁగలను యిక్కడ తెన్ను గ్రహింపనైతి! హా!
మవ్వపుభక్తియుంగలిగి మూర్ఖవిధంబయివాఁడనక్కటా!

సుగ్రీవాదులయెదుట నెన్నియో బింకంబులుంబల్కి యిచ్చటికరుదెం
చితిని, అయ్యో! నాకష్టంబంతయువ్యర్థంబగునా! నేనింకనేమియొనర్తును.

మ॥ కటుసంరంభముతోఁడ దుష్టుఁడిటకున్ గైకొంచుశ్రీరామునిన్
దిటసత్వంబునఁజేర సంతతముదోద్రేకంబునన్ జిక్కి చీ
కటిలోకాంతునిఁ గాంచఁజాలకను హృత్కంజంబునన్ దుఃఖమున్
మెటుచక్రాంగనబొందు నావిధమునన్ నేదుఃఖమున్బొందితిన్.

దుఃఖోపశమనమునకై సింహశరభశార్దూలాది భీకరమృగారావసంకలి
తదుర్గమాటవులనేకంబులు తరించియుపరులకభేద్యంబగుపద్మనాళంబుఁ

జొచ్చి వెడలియు యిసుమంతయైనను లాభంబుపొందనైతిని. (ఎదుర జూచి) అదిగో! అచ్చట నెవ్వరో శస్త్రాస్త్రంబులుఁదాల్చి కూర్చుండియున్నారు. ఆతఁడీపద్మనాళంబున శత్రువులెవ్వరును ప్రవేశింపకుండఁగా కాచుచుండుఁగాఁబోలును. ఇఁక పగతుఁడనగు నన్నాతఁడు కని యూరకుండునా? నేను పగతుఁడనని యాతఁడెట్లు గ్రహింపఁగలఁడు. గ్రహించునుఁగాక! గ్రహింపక పోవుఁగాక; ఎట్లును మార్గమడుగక తప్పదుగదా! పోయియడిగెదఁగాక (సమీపించి) అయ్యా!

తే॥గీ॥ ఇందుఁగనుపడు మార్గంబులందునేది
భోగవతి పట్టణమునకుఁ బోవునయ్య
వేగముగఁ దెల్పినను బంపవేఁడువాఁడ
ప్రియవిక్రమ! గుణధుర్య! భవ్యరూప.

మత్స్య—(చూచి) ఓయీ! నీవెవ్వరవు? ఈయంబుజనాళమేల తరించితివి.

హను—ఆ! నేననుకొన్నట్లీతఁడు పగతుఁడే! ఈయంబుజంబు నేలతరించితివని ప్రశ్నించుచున్నాఁడు. (ప్రకాశముగా) అయ్యా! నేనవరినైన నేమి? కొండొక కార్యోద్ధరణమునకై యీతమ్మిని నిర్గమించవలసెను. మీరెఱింగియుంటిరేని నాయందు దయావహులరై గుండే మార్గము భోగవతీపురంబున కరుగునో తెలియఁజెప్పుఁడు.

మత్స్య—ఓయీ! నీవీపద్మనాళంబు నెవ్వరియాజ్ఞానుసారంబుగ తరించితివో ముందునాకెఱింగింపుము? అట్లుగఁ జేయునిష్టము గల్గదేని భోగవతీపురంబునకరుగు తెన్ను నడుగక వచ్చిన నీవను సత్వరముగ జనుము. లేదేని భీషణసంగ్రామ రంగంబున మత్సునిశిత బాణంబులకు నీదేహంబు నశనంబుఁగావించెద.

చం. నలువకునైన శూలికయినన్ యమరేంద్రునకైనఁ జెల్లదీ
కలువఁదరింప నేను నొడికంబున నాజ్ఞయొసంగకున్నచో

ఖలుఁడ! మదీయయాజ్ఞఁ గొనక న్వడిదాటితి వెవ్వరీవొకో
తెలుపుము తెల్పకుండినను ద్రెంచెద నీదగు ప్రాణకోటులన్.

హను—ఓయీ! బాలకా! చేసరుదెంచిన కార్యంబు నెఱవేర్చుకొనకుండ నెట్లు వెనుదిరిగి పోవువాఁడ? నీవు నీస్వామియాజ్ఞానుసారంబుగ యీపద్మనాళంబునుఁ గాపాడుకొనుచుండుము. శత్రుదుర్భేద్యంబులగు మదీయ వాలప్రహారంబులకు నీశరీరంబు నడ్డపెట్టకుము.

మత్స్య—ఓహో! నేను నిన్నడ్డగింపరాఁగూడదు కాఁబోలును? అడ్డగించిన నాప్రాణంబులు నిలువవుగాఁబోలు! ఓరీ! తరుచరా!

ఉ. కారణమేమి నీవిటకు కంజజమున్ వడిఁదాటిరాఁగ నా
కారణమేమి తెల్పియటు కాలఁగదల్పము లేకయున్న నో
భీరుఁడ! పారద్రోలెదను భీషణకార్ముక బాణశక్తిచే
శూరుఁడు బాలకుండనుచు చోద్యము నీమదినంద వానరా.

హను—(తనలో) అక్కటా! సకలరాక్షసవిరాముండగు శ్రీరామునకు గారాబుబంటనై దైత్యదానవానీకంబుల భీకరసంగ్రామ రంగంబుల నిహతులఁగావించి కీర్తికాంతాపరిచర్యలచే సంతృప్తినొందు నే నీనిసువుతోఁడ నెట్లు సంగ్రామము సలుపఁగలను? అసమానపరాక్రమశాలినగు నాకిట్టి కార్యంబీనిసుంగు విషయమున సిగ్గులచేటు కాదా? నే నిప్పుడేమి సేయుదును? బాలుఁడా! సాముముచే చక్కఁబడునట్లు కనుపింపఁడు. చిట్టకొంచెమైనను కూతఘనమను నార్యోక్తిని సార్థకపఱచుచున్నాఁడు. కావున యించుక కఠినత్వముఁజూపించెద. కొండండీ కొనఁడలంచు పొట్టేలు చందంబున నన్నుఁడీకొనఁదలంచుచున్నాఁడు. వెఱపించి నప్పటికిని వినకయున్న నాప్రతాపమునుమంత కనఁబరచి యరిగెదఁగాక! (ప్రకాశముగా) ఓరీ! బాలకా! శత్రుదానవగర్వనిర్భేదకంబులగు నావాక్యంబులు నిన్నుఁ బెదరింపఁ జాలవుగా! నాప్రతాపమెఱుంగవు గాఁబోలు; చెప్పెద వినుము.

ఉ. దుష్టులవారిమిత్రముల శోకమునంబెట్టియు నేలఁగొట్టి ఓ
కష్టుఁడ కీర్తిగాంచిధరఁ గ్రాలెదు నన్నిటుఁదాకనెంచుటల్
కష్టుఁడ నాపవిత్రతావవిశిఖానలకీలలలోన మ్రగ్గఁగా
స్పష్టమటంచునెంచుకొను మామనమందున చిన్నిబాలకా.

మత్స్య—ఓహో! నీవుదుష్టులనెందరినో దునుమాడి కీర్తిగాంచితివేమి? నీతోడఁబోరఁదలంచుట ప్రాణంబులు పోఁగొట్టుకొనుటయని తలంచుకొనవలెనేమి? ఓరోరీ! స్వపవిత్రతావర్ణనాసక్తచిత్తా! దుష్టా!

ఉ. పేదరికంబెమాటలకు వెల్లుగవాఁగిన నిన్నుఁబట్టి క్రూ
రా! దునుమాడువాఁడ రణరంగమునందున పంచభూతముల్
సాదరబుద్ధినిన్ను మనసారగ సాకగవచ్చుఁగాక ఓ
రీదురితాత్మ! పొమ్ము యిపుడీవునువచ్చిన రేవుచేరగన్.

హను—(తనలో) ఈబాలుండు నేనెంతచెప్పినను వినక నోటికి వచ్చుకొలందిని దుర్భాషలాడుచున్నాఁడు. కావునసుందరముఖారవిందుండగు యీబాలుఁడు నాకుదారినిచ్చు తెఱంగున నాబలంబించుక జూపెదను. బలంబినుమంత చూపుటెట్లు? శత్రువులపైకిజంకినుమంతయుఁ లేక మదమాతంగంబులమీఁదికిఁదూకు సింహకిశోరంబు చందంబుననుండు నాబలంబెట్లు తగ్గును? ఇట్లానర్చెదఁగాక! ఆర్తలోకరక్షకా! రామా! దుష్టునిచేఁజిక్కిన నిన్నెట్లయినను తప్పింపఁ బ్రయత్నించు నన్నీబాలుఁడడ్డగించె. కావున నాబలంబించుక చూపనూహించితిని. నాచే యీబాలకుఁడు మృతినొందకుండఁగా పాదవేడెదను. (ప్రకాశముగా) ఓరీ! బాలకా!

కవిరాజ విరాజితము.

చెడిపోదవంచును చెప్పిననీవిట చెట్టతనంబును పీడవుగా
బడబడవాగిన పల్కులెఘనమని భావమునందున నెంచకుమా

ఉడుగుముపోరిట లూరక నేటికి యూడగఁజేసెదు నీయసువుల్
వడివడిఁబొమ్మిక ప్రాణములందున ప్రాణములుంచియు బాలకుఁడా.
అట్లునీవు నీదారిని తొలఁగిచనవేని,

కం, భీకరసంగ్రామంబున
ఓకుమతీ! నిన్ను దునిమి రోహాహాయంచున్
ఆకాశమందు తిరిగెడు
నాకపురీశుండుమెచ్చ నరిగెద నేనున్.

మత్స్య—ఓరీ! వనచరా!

ఉత్సాహ। ఛీ! దురాత్మ యేలయిట్లు చెడ్డమాటలాడెదో
వాదమేలనీకునాకు ప్రాభవంబుగల్గుచో
నీదుశక్తిఁజూపి నన్ను నిర్జరాళిమెచ్చఁగా
బోఁదగున్ జయించి కూళ!పోటుమాటలేటికిన్.

నీవు నాశక్తి నెఱుంగక యీలీలమాటలాడఁగడంగితివి. నాశక్తినించుక చెప్పెదను వినుము.

మ. అలనాకాధిపుఁడైన యబ్జభవుఁడే యైనం జగద్రక్షకుం
డలనారాయణుఁడైన నాత్రిపురసంహారుండె యైనన్ వెతన్
కలకంజెంది ధనుస్సులన్ విడచి నాకాళ్లంబడంజేతు! నో
ఖలుఁడా! నీవనెంత యాలమున నాఖడ్గప్రహారాళికిన్.

హను—(తనలో) ఈబాలుండు నేనెంతజెప్పినను వినక యింకను తాఁబట్టినకుందేటికి మూడేకాళ్లనియు, బలవంతుఁడననియు, మూర్ఖపుపట్టును బట్టియున్నాఁడు. ఇంచుకమద్భుజాబలంబు చవిఁజూపిన గాని నన్ను పోనీయఁడు. రణంబొనర్చి లోబరచుకొని పిదపనేగెదఁగాక! (ప్రకాశముగా) ఓయీ! మూర్ఖహృదయా! నీవుబాలకుఁడవగుటచే,

తే. గీ. చెప్పితినియింతపట్టును చెప్పఁదగిన
వాక్యములనెన్నియో గాని బాలకుండ

దానినిసుమంత బాధంబు గానఁబడను
రమ్ము రణరంగమునకు బోరాడనీవు.

మత్స్య—ఓయీ! వృద్ధవానరమా! రణంబు సేయుటకే నిశ్చయించుకొంటివా? నీకు ప్రాణంబులపై వాంఛ లేదా? మదీయనిశితాశుగంబులు నీప్రాణవాయువులం గ్రోలఁదమంతట దాము పొదినుండి వెడలుచున్నను యింతవరకా యమ్ములనాపితిని? నీయోగంబిట్లుండ నాచేయునదేమి కలదు. సమరతలంబున కరుగుదమురదు. (అని హనుమంతునితో నిష్క్రమించి మరల ప్రవేశించి) బాలికా! నీపరాక్రమము సర్వంబునువమ్మయ్యెనా?

హను—బాలకా! నాపరాక్రమమున కేమిగాని.

మ, జనకుండెవ్వఁడునీకు? నిన్నుఁగన నేసాధ్వీలలామంబు? ని
న్నును పోషించెడు భూమిపాలుఁడెవరో న్యాయత్వముం బొందకే
వనమధ్యంబుననున్న కైరవముగా బాడంగ నూహించినా
వనధా! యిట్టిభుజాపరాక్రమముచే యయ్యారె వర్ధిల్లియుఁ.

మత్స్య— ఓయీ! వానరా!

చం, రణమొనరింపవచ్చి సుకరంబుగ శూరతవీటఁబుచ్చి యో
వనచర! తల్లిదండ్రులను వారక తెల్పుమటంచుఁగోరఁగాఁ
జనునె! రణంబు సేయుటకు సత్వమునీకు చెలంగియున్న చో
ననుఁబోరిగొమ్ము! సత్వము గనంబడదేని తొలంగి పొమ్మికన్.

హను—ఓయీ! బాలకా! కులగోత్రవిమర్శన మొనర్చి పెట్టి వారినైనను రణంబున డీకొనుట యుత్తమంబని బుధులువక్కాణించెదరు. అదియునుఁగాక! అహితులకు కులగోత్రంబు లెఱింగించిన నష్టముందునా? నీశూరత్వంబునకు లోటుగల్గునా? కావున సంశయింపక నాకెఱింగింపుము.

మత్స్య—శత్రుత్వంబువీడి మిత్రత్వంబు నెఱపనూహించి నీవు నన్నడుగ చెప్పరాని దేమియుండును.

చం. వనచర! తెల్పువాఁడవినుఁ వాయుసుతుండగు నాంజనేయుఁడే
జనకుఁడు తల్లిమత్స్యమది సంద్రమునన్ సతతంబునుండునన్
గనికృపఁగాచువాఁడు రణకర్కశుఁడై చనుమాయరావణుం
డనియెదువాఁడు మత్స్యపతియందురు లోకములోన నన్ బ్రజల్.

శ్రీరామపదభక్తుఁడగు పవనసుతుని కొమరుండనగుట శత్రువులత్రుటి మాత్రంబున నిర్జింపుచుందును.

హను—ఓయీ! బాలకా! పుట్టిననాటఁగోలె వాయునందనుఁడు నిశ్చలుండై బ్రహ్మచర్యంబు ననుష్ఠింపుచున్నాఁడే? అతండే దినంబున సతినపేక్షించి పుత్రునిఁగాంచెను? అదియునుంగాక? జలచరంబులకును తరుచరంబులకును సంయోగంబెట్లు కలుగును ? గ్రుచ్చిగ్రుచ్చియడిగితి నని యిట్టియనృతంబు లామహాత్మునిపైఁబన్నిన నీకేమిలాభముగలుగును. అనృతంబున సర్వస్వంబును నమ్మగుననను నార్యోక్తి వినవా! అట్టియెడ యిట్టియనృతంబులాడ నీకు భావ్యంబగునే? కాన నిశ్చయంబెఱింగింప వేడెదను.

మత్స్య—అయ్యా! కాలానుసరణంబున సత్యంబసత్యంబుగను యసత్యంబు సత్యంబుగను పరిణమించుచుండును. దానికి నేనేమిచేయఁగలను.

తే. గీ. కానలేయుండు జానకిఁగనుఁగొనఁగను
దక్షుఁడౌ వాయుసుతుఁ బంపెదక్షిణమున
కతఁడు వారిధిదాటెడు నట్టివేళ
చెమట సంద్రంబునన్ బడె తిమియుమ్రింగ.

అట్టులా మీనంబు ఘర్మకణంబుఁ ద్రావినంతన గర్భంబు ధరించె. కాలక్రమంబుననాగర్భంబు పెరిగి సకాలంబున నే నుద్భవించి తీరంబున కరుదెంచి దుర్మదులగు పౌలసుదిండిమూఁకల నుక్కడంచుచుండవసుంధరాదేవి నన్ను నవలోకించి జననీజనకుల నామంబులెఱింగించి యీరాజును సేవించుచున్న యిచ్చట నీజనకునిఁ గాంచఁగలవని నన్ను నియమించిన నేనిట్లున్నవాఁడ. దైవోపహతులు సౌఖ్యాస్వాదన మొనర్పఁజాలరను వాక్యార్థంబు నాయెడలనిక్కువంబుగా ధారుణిదేవివాక్యంబు రిత్తయయ్యె.

హను—అట్లయిన నోమత్స్యవల్లభా! చింతిల్లకుము, అనంతరత్నభూషణ భూషితయగు వసుంధరాదేవి వాక్యంబు లేలరిత్తయగును? ఆదాశరథిచే నేన జానకీ వృత్తాంతంబరయ వారాశిదాటితిని. నీవునాపుత్రుండవని యెఱుంగకుండుటచే ఁబంతగలిగె. అయిననేమి. ఎఱుఁగకఁ జేసిన ద్రోహంబునకు చింతింపకుము. గతజలసేతు బంధనము కార్యాను సరణముగాదు.

మత్స్య—అయ్యా! నీవునాజనకుఁడవని చెప్పుటకెంతయు సంతసించితిని. మిమ్ములఁగాంచుటచే నాజన్మంబు ధన్యంబయ్యె. అయినను.

సీ. శ్రీరామునాజ్ఞను శిరమందునన్ దాల్చి
జానకినింగాంచఁ జనెడువేళ;
వారాశినిందాటు పట్టునలంకిణిన్
సంహరింపఁగఁబూను సమయమందు;
ప్రాకారములఁదాటి పట్టణంబు ప్రవేశ
మొనరింప నూహించి జనినయపుడు;
జనకజకౌఁ ఆకునై మణిజాలఘట్టిత
ప్రాకారములఁ జొరఁబాఱునపుడు;

తే. గీ. వేరుసమయంబులందున వేరువేరు
గతులఁజూపినరూపముల్ గానఁబఱచి
తనయుఁడనునైన నన్ను సంతసమునందు
ముంచఁగ వేఁడుచున్నాఁడ పూర్ణదయను.

హను — కుమారా! ఇదేమదీయరూపావళిందిలకింపుము. (అనేకచిత్రరూపములను జూపును.)

మత్స్య — హా! సకలదుష్టనిశాచర సంతాన కాంతార దావానలా! ఆశ్రితజనా ఘలతాచ్ఛేదన శాతకుఠార స్వరూపా! మారుతతనూజా! నమస్తే నమస్తే.

ఉ. శ్రీరఘురామపాద సరసీరుహ భక్త! సుమిత్రిపోష! భ
క్తాళిక భీష్టసిద్ధి ఫలదాయక! దైత్యకులాటవాగ్ని యో
వీరవరేణ్యా! నీదుఘన భీకరరూపముఁ గాంచ ప్రాణముల్
మారుతమందుఁ జేరె! నిఁక మారుతనందన! రూపుడింపుమా.

హను — కుమారా! ఇప్పటికైనను నీసంశయంబు తొలంగెనా?

మత్స్య — జనకా!

తే. గీ. హారములలోనీకు మొలత్రాడొ తారలెల్ల
కర్ణరతనాల చౌకట్లొ కన్నులొకొ
దినకరనిశాపతులునీకు దేవదేవ?
తెలియఁబల్కుఁడు వినియెద తెల్లముగను.

హను — కుమారా! ఆకాశలేయునియను కంపాయతి నాయందు పూర్ణీభవించిన యీతారాసమూహము మొలత్రాడనుఁగాఁజాలదు.

మత్స్య — జనకా!

చం. జనకుఁడవంచు నిన్నెఱుఁగఁజాలక సల్పినతప్పునైచి మ
న్ననమొయిఁజూచి కావఁదగు నన్ను పదంబులుపట్టి వేఁడెదన్.

ఇనసుతమిత్రమా! రవికులేంద్ర పదాంబుజ మత్తభృంగ! పా
వనగుణసాంద్ర! దైత్యకులపద్మవనీ గజ! మారుతాత్మజా.

ఉ. బాలుఁడ జ్ఞానహీనుఁడను భావ్యమభావ్య మెఱుంగ లేక నీ
లీలను సంగరంబునకు రేఁచినయించుక కోపగించకే
బాలుఁడనైన నాకిట కృపామతిఁ గెల్పొనగూర్చి పట్టినన్
గాలితనూజ! యిట్టిఁడని నావళ మేపొగడన్ రవంత యేన్.

హను—(లేవదీసి) కుమారా! ఇందు నిన్ను క్షమించవలసిన దేమియున్నది. స్వామికార్యంబునందు భక్తి కనుబఱచితివి. అందుకొఱకై కాదే! నే నీయంబుజనాళంబునఁ జొరఁబడివచ్చుట.

తే. గీ. రావణుని పంపునను మయిరావణుండు
రామలక్ష్మణులం దెచ్చి దీమసమున
వానిదునుమాడి వారిగాపాడుదునని
వచ్చినాఁడను నేపుత్ర! వైళముగను.

ఇట్లరుదెంచి,

క. తనయుని నిన్నును గాంచితి
మనమున కానందమాయె మత్పూర్వఫలం
బునుఁబండె నైనను విను
మినకులజులఁ గాంచకునికి యెద చెలఁగదుసూ.

కాన విమ్మట నరుదెంచి నీతోఁడ సంభాషించెదను. దుష్టుండగు మైరావణుఁడు వారల నెచ్చోటనిడెనో నీవెఱుంగుదువేని నాకెఱింగించి యాస్థలంబు నేఁజేరఁగల మార్గంబు తెలుపుము.

మత్స్య—జనకా! ఆతనిసొమ్ము తినుచుండియు యాతనిగుట్టు బట్టబయలు సేయుట నాకు భావ్యంబుగాదు. అయినను లోకరక్షణపరాయణులగు వారికి ద్రోహంబూహించిన వానిగుట్టెఱింగించుట నాకంతి

తప్పుకాదు. అందుమీఁద కన్నతండ్రి కటాంగించుటవలన నాకినుయంత యేనియు పాపంబు రాఁజాలదు. ఇప్పుడింటికి నేగుదమురండు. పిమ్మట మీకు సర్వంబును విశదపఱచెద.

హను—సరే! అట్లే చేయుదము (నిష్క్రమింతురు.)

---

## తృతీయరంగము.

### ఉద్యానవనము.

(హనుమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

హను—(ప్రవేశించి) ఇదే కాఁబోలును నాకటాంగించిన కాసార రాజంబు. బళీ! ఏమి యీయుద్యానరామణీయకము.

సీ. జలదమా! మాతోఁడ సాటి రాఁజాలవు
పలుమెఱుంగులతోఁడ నలరినంత
మందాకినీనది! మాసాటియగుదువా
కమలముల్ నీవెన్ని గలిగియున్న
గగనమా! మాసాటిగాలేవు నీవెన్ని
తారలమేనిపైఁ దాల్చియున్న
సత్పథమా! నీవుసాటివత్తువె మాకు
సురలుగొప్పగనిన్నుఁ జూచినంత

తే. గీ. అనుచు హేళనసల్పెడు నట్లుగాఁగ
కనగ నలలును కమలముల్ ఘనసువాస
నలుకదుఁ జిల్కుపువ్వులుఁ గలిగినడల
హాయినొడఁగూర్చె సుందరోద్యానవనము,

నొఱియును యీ కాసార రాజము.

తే. గీ. మార్గమునఁబోవు వారినిమత్తుసార
జలములందున జలకంబు సలుపుఁడనుచు
తృష్ణదీర్పుకొనుండంచుఁ దెలుపుభంగి
యలలుతీరమును దాకు నలఘుశక్తి.

నాకుమారుఁడు మార్గమెఱింగించునపుడు ఘోరరజనీచర పాలితంబగు నిప్పురద్వారంబున నొక్కతాస్రుఁ గలదనియు, అదిపగతురపదంబులు సోకిన తుత్తునియలగునుఁగాన పదిలంబుగాఁ బోవలయుననియు యెఱింగించి పిదపరాక్షసజనంబులెల్లరు సలిలంబులకీ సరస్సున కరుదెంతురనియు యందేకాంతవర్తింబునుండి దినకరకులజాల నామంబులుబయలుపడునో, యాకాంతవలన పురంబుఁబ్రవేశించుట సుఖంబగుననియు నెఱింగించె. ఇంకనాకాంత యెప్పటికరుదెంచునో, యరుదెంచి మదీయశ్రవణానందంబుగ పల్కునో, కర్ణకఠోరంబుగ పల్కునో, నాకేమియుతోఁచకున్నది. (ఆలకించి) అదిగో! ఎచ్చటనో శ్రీరామనామము వినవచ్చుచున్నది. ఆసాధ్వీలలామం బరుదెంచుచుండెనేమో! గ్రహించెదఁగాక!

దుర్దండి—(ప్రవేశించి) ఓపాడుదైవమా! రఘుకులరత్నాకరచంద్రుల దుష్టుండగు మైరావణునిచేఁ జంపింపనెంచెదవే! ఆపాపుదశకంధరుని సత్వంబు సర్వంబును ఖర్వముగా నొనర్చిన, మేటివీరులకా! కటకటా! యిట్టిపాటు! ఓదీనజనమందారులారా! ఓసూర్యచంద్రులారా! ఓనాకలోకనివాసులారా! సత్యసంధులై యినకులవార్ధిచంద్రులై యలరారు రాజన్యవరుల కిట్టికష్టములుకలుగ మీరూరకుండురేల? ఊరకుండకేమి సేయుదురు? దుష్టునకు దూరంబున నుండఁదగునన్నవాక్యము మీరు రిత్తపుత్తురా! ఛీ! అనుపమానబలపరాక్రమసంపన్నుఁడగు యాయవార్పతితనూజుండును యెల్లవేళల రఘుపతి పాదపద్మ భజనానంద హృదయుండగు వాయుసూనుండును, దానవ మర్మకర్మంబు లెఱింగిన విభీషణుండును దైత్యదానవానీకంబుల రణరం

గంబున భంగంబునొందింపంజాలు తక్కుంగలకపిసమూహంబులును, జగద్రక్షకులుం గావాడ సాహసింపఁజాలని యుద్వృత్తు దిక్కులేక చచ్చి పడియున్న వీరేమిచేయఁగలరు? ఓదేవాదిదేవులారా! గతిలేక కారాగృహంబునఁ జిక్కి చావసైయున్న మముబోంట్లకు యిట్టిగతి చెల్లుంగాని శత్రుమర్మవిభేదనులగు రామలక్ష్మణులకా యిట్టిపాటు! అయ్యో! ఈకూరకర్మమెవ్వరితోడఁ జెప్పుదును. ఈదుష్టుని దుష్టచేష్టల కెవ్వరడ్డుపడుదురు హా! దీనబంధూ! ఆర్తలోకరక్షణ పరాయణా! రాఘవా! (విలపించుచుండును.)

హను—(తనలో) ఈమెయె కాఁబోలు నాకొమరుండు నాకెఱింగించిన వనితాలలామ! అహా! కోసలాధీశుల కావేశించిన యాకష్టంబులకెట్లు తల్లడించుచున్నది? ఈకాంత దానవకులంబున కెల్ల నాయకరత్నంబనఁ దగదే? సమీపించి పలుకరించెదఁగాక! (సమీపించి) వనితామణీ!

ఉ. ఎవ్వతెవీవు? నీకుమొదఁడిట్టుల కష్టచయంబుఁగూర్చె? నీ
వెవ్వనికోసమీ కొలనికేడ్తరఁజేరియు శోకమందెదో!
చివ్వనఁజెప్పునాకు ఘనశీల! త్వదీయమనోవ్యథాగ్ని నే
దవ్వులఁజిమ్మువాఁడ వనితామణి కూల్చెదనీదు శత్రులన్.

నీమనంబున నించుకైనను భయపడక యున్నస్థితి నెఱింగింపుము. అవసరమగునేని యాపురంబు నీచేతనయేలించెద.

దుర్గం—అన్నా! నీవెవ్వరవు! సుధారసధారలం జిల్కునీవాక్యంబులు విన్నంతనే మదీయ మానసంబానంద పారావారంబునఁదేలియాడుచున్నది. నీవీయెడ కరుదేరఁ గారణమేమి?

హను—సోదరీ! వినుము. నేనుదశరథరాజనందనుకూర్మిబంటను, వాయుసుతుండను, దుష్టుఁడగు రావణునిచే పరిబాధితుఁడై పైరావ

ణుఁడు రాముని వధింప దొంగతనమున కపుల మోసపుచ్చి కొనివచ్చెను. వాని సపుత్రమిత్ర బాంధవంబుగఁ దునుమాడి యారాజకులాలంకారునిఁ గొనిపోవ నేనరుదెంచితిని. కావున నీమనంబున చింతింపక నీకిట్టి గతి పట్టుటకు కారణము నాకెఱింగింపుము.

దుర్దం—భక్తజనసులభా! నిన్నుఁగనుఁగొనినయపుడే నామనంబానంద మగ్నమయ్యెను. నావృత్తాంతం బెఱింగించెద. ఆలకింపుఁడు. ఈలంకాపురం బేలు మైరావణునకు తోడబుట్టువునై కాలదండుఁడను రాక్షసవీరునకుఁబత్నినై దుర్దండినామంబున మెలఁగుచుండి యనేక కాలంబు పుత్రులులేక పిదప దైవానుగ్రహంబున నొక్కకుమారుని నీలమేఘాకారుని నీలమేఘనాముని గాంచితిని.

హను—సుతోదయం బెల్లవారలకును మనోహ్లాదకరంబుగదా? తరువాత?

దుర్దం—అట్టులా పుట్టినబిడ్డను ప్రాణపదంబుగఁ గాపాడుచుండ నొక్కదినమున అశరీరవాణి నాసోదరుంజూచి “ఓయీ! మైరావణా! నీసోదరికి జన్మించిన బాలకుఁడు నీతనూజను పరిణయమై యీపాతాళలంక నేలఁగలం”డని తెలియింప నాపాపాత్ముండు మనంబున పట్టరాని క్రోధంబూని నాసుతుని కంఠము పిసుకవచ్చెను.

హను—ఔరా! దురాత్ముఁడెంతకు సాహసించెను. తరువాతఁ దరువాత.

దుర్దం—అట్లరుదెంచు నాసోదరునకు నేనును నాపతియు నడ్డువడి పాదంబులుఁబట్టి వేఁడ యెట్టకేలకు నాతనూజునిఁజంపక యప్పటికి వెడలిపోయి క్రమంబున పూర్ణిమాచంద్రుని సోయగంబు డిలువడఁ జేయఁజాలు లీలయౌవనవిభవుఁడగుట చూపోపక మరణతుల్యంబగు కారాగృహంబున నునిచి పుత్రునికై తల్లడిల్లు మమ్ముల నాచెంతనైనను నిలువనీయక నామనోహరుని నిష్కారణబ స్వర్గలోకనివాసునిఁగా

నొనరించి నన్నీవిధిశృంఖలపాశబద్ధంజేసినాఁడు. మఱియు నన్ను బంటును బానిసయుఁగాని విధంబున తనయింట నన్ని పనులకు నీడ్చుచుండును.

హను—అహా! దైవముమంచివారలకేగదా కష్టంబులుఁగూర్చుచుండును. సోదరీ! తరువాఁత?

దుర్గం—నేఁడు నన్నుఁబిలచి రావణునాజ్ఞ రామలక్ష్మణులం దెచ్చితి. వారిని భద్రకాళికిఁ బలిచేయవలయు. నీవుసత్వరంబువజలంబులఁగొని రమ్మని నన్నంపె. నేనునుజలకలశంబునూని జలంబులకై యరుదెంచి విలపించుచుండ మీదర్శనంబాడగూడె. నాజన్మంబు సార్థకంబయ్యె.

హను—తే. గీ. పొలతి! యిఁకమీఁద చింతనుఁబొందబోకు
నీదుసోదరుఁ డున్మాడి నీదుసుతుని
నీలమేఘుని రాజుగాఁ నిలుపువాఁడ
గగనభూమిని వల్కునిక్కంబుగాఁగ.

నన్నుశీఘ్రంబునఁ దోడ్కొనిపోయి మారాజచంద్రులఁ జూపుము.

దుర్గం—చిత్తము. పోవుదమురండు.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.





# మారుతి విజయము.

## చతుర్థాంకము.

### ప్రథమరంగము:——సభాభవనము.

మైరావణుఁడు, భైరవుఁడు, దుష్పధుఁడు ప్రవేశించుచున్నారు.

మైరా——సేనగా! తరువాతఁదరువాత?

దుష్ప——దేవా? అవధరింపుఁడు. అట్లావనచరభుజాబలంబున కుఁజిక్కి మనసైన్యంబులుక్కుఁదక్కి పిక్కబలంబుఁ జూపుచుండ, సేనానాయకుఁడగు మేఘవల్లభుఁడు ప్రళయకాలంబున భూనభోంతరాళంబులు భస్మీకృతంబులు గావింపఁ జెలరేఁగుదావానలంబు నార్ప భీషణంబుగఁ బయలుఁదేరు నామేఘవాహనునిమాడ్కి, భీకరారణ్యంబులను దహించుదవానలుని విధంబున వాతరుచరుం దలపడి ప్రళయకాలమేఘజ్వాలాసమానంబగు మనసేనంబుగికొల్పుచు, అక్షీణ నిశితకౌక్షేయక ప్రకాండప్రచండభుజాదండమండిత దండధరకింకరుల నుద్దండతసంగరరంగంబునఁ డీఁకొనడం జేసి పాఱుఁదోలు గిరిపుత్రికామనోహరునిలీలఁగనుపట్టు, యావలీముఖుండును నేత్రయుగ్మంబునుండి వెడలు యగ్నికణసందోహంబులు ధారుణీతలంబు వెల్లుగనిండ జలదంబులుజలంబులగురియురీతి రాల్చుచు హిరణ్యకశిపునిసంగరంబున భంగంబునొందించు నాచక్రధరునిమాడ్కి మన మేఘవల్లభునిదాకి ఘోర మృగంబునుద్రించు మృగరాజుచందంబున దళవాయిని ధరాతలంబున కరాఘాతంబునఁ గూలనేసె.

మైరా — హా! మేఘవల్లభా!

మ॥ ఘనసంగ్రామమునందు దేవతల వేగన్ బాఱంగాఁజేసి పే
రును ప్రఖ్యాతినిఁగన్న నీ వెటులన్ క్రూరాస్త్రఘాతంబులన్
అనఘా! జీవముక్రొత్తికిన్ విడచినన్ హా! యింకనెవ్వారు నన్
గని సంతోషముగాంచు మంచనెదరో నావైరులందుప్రొంచుచున్.

సేవకా! తరువాతఁదరువాత?

దుష్ప — అటువిమ్మటనో దేవా! సురాసురయక్షగరుడగంధర్వకిన్నరకింపురుషాది నిఖిలఖేచరుల భీకరసంగ్రామంబున నిజబలపరాక్రమంబున జయించి విజయంబుఁ గైకొనిన మనమురుండు నమ్మధుమథను ధిక్కరించు నిర్వక్రపరాక్రమంబునఁ రణరంగంబున తురికి నేత్రద్వయంబులఁ ప్రళయకాలదావానలుండు తాండవంబుఁ సలుప నాశాఖామృగంబునుఁ దలఁపడి, ఓరీ! తరుసంచరా! వనీతలంబున వృక్షాలంకారంబులగు ఫలంబులు మెసవినకండక్రొవ్వున కన్నుఁమిన్నుఁగానక స్వబలపరబల తారతమ్యంబు తెలియంగక రసాతలంబు తలాలువఁ జొరబడినదియె కాక, నిశాచరకులరత్నంబులం దలఁపడి కృతాంతునిశాంతంబున కనుపుచున్నాఁడవా? ఔరా? నినుబోలుసాహసికుండు వేరొకఁడుండుండఁబోఁడసి పరిహాసపరంబుగ భాషింగొనియాడి కయ్యంబునకుతొగసి కరంబునున్న కరవాలం బాక్రూరతరుచరునిపై వైవ నాతరుచరుండు పగతురహృదయంబులు బ్రద్దలగునట్లు సింహనాదంబుగావించి. యానిశితకౌక్షేయకంబును కరంబునఁగీలించి భగ్నంబుగావించె. అట్టులాతరుచరుండు కరవాలంబుభగ్నంబుగావింప మనమురుండు క్రోధంబినుమడించి. దండతాడితభుజంగంబువగిది, మట్టమధ్యాహ్నంబుననిజకరతీక్ష్ణప్రభలచే వెలుంగు సహస్రకిరణునిమాడ్కి మండిపడి వేరొక్కఖడ్గంబు బాక్రోత్తిపైవిసర నాగోలాంగూల మాకరవాలంబు కరంబునగీలించి ప్రళయకాలంబున చతుర్దశభువనంబులును తనయందుపసిం

బఁజేయు సముద్రనిభంగి మనస్సైనికనికాయంబులం దలపడి, పదంబు లఁదన్నుచు కరంబులఁగొట్టుచు, రథంబుల హాయసహితంబుగఁ గూల్చుచు, రథచోదకులందునుము దు. సిడంబుల్ద్రుంచుచు, మురునియు రదంబుసమీపించి చోదకసహితంబుగ రథాశ్వములనుఁగూల్చి, ఓరోరీ! దుష్టదైతేయకులసంభవా? స్వబలపరబలతారతమ్యంబు తెలియంగ లేమియని పరిహాసించి నీవెందుఁబోయెదవు? నిలు. నిలు. నీమిత్రులు నీకొఱకు యమసదనంబున నెదురుచూచుచున్నారు. వారినోదార్పఁబొమ్మని తన హస్తంబుననున్న కరవాలంబున దళవాయియగు మురుని శిరంబు మారుతాహతిరాలు నారికేళఫలంబు లీలభూతలంబునఁ బడనేసె.

మైరా—హా! శత్రులోకతిమిర ప్రచండభాస్కరా! మురా!

తే|గీ| స్నేహితులు బాడుకొ్రఁతిచే వాహవమునఁ
గూలివారని మదిలోనఁ గుందబోకుఁ
డోదనుజ వాధయించు వన్నాదరించు
నీవుకో్రతికివిడిచివే జీవములను,

అమాత్యా! భైరవా!

ఉ| సంగరరంగమందు మదశాత్రవసేనలనుక్కడంచు నేఁ
భంగముకో్రతి చేఁబడినవాతఁడివిన్ శతకంఠముఖ్యులు
ప్పొంగుచునవ్వరే! యకట! పోటుఁదనంబిఁక ధాత్రినున్నయా
యంగనలేని శౌధగతి! హా యిఁకనేమిచేయునర్తు! భైరవా.

శతముఖాదిరాక్షసవీరులు నవ్వుటయెట్లున్నను సంగ్రామరంగంబునబల పరాక్రమంబున దేవకోటినిఁ గీటడంచి యక్షాదినిఖిలఖేచరులను సునిశితసాయకంబుల నొప్పించి పిక్కఁబలంబు చూపునట్లొనర్చిన మురుండుజీవంబులఁ బాయుటకనేనెట్లు పగతురవిగతప్రాణులఁగా నొనరింపజాలుదును. భైరవా! నేనెందులకుఁ జింతింపనుగాని.

తే॥ గీ॥ ఎట్టివేళను ధాత్రిపైఁబుట్టినారొ
విజయమనుమాట యెఱుగరీ విధునివంశ
మందుబుట్టినవారలో మంత్రివర్య!
గాకయుండిన విజయంబు గలుగకున్న.

భైర—రాజా! చింతించినఫలమేమి? గతజలసేతుబంధనము భూపాలురకు నీచంబుగదా! సేవకా! అటుపిమ్మట సంగతి విన్నవింపుము.

మైరా—సేవకా! అటుపిమ్మట?

దుష్ప—అటుపిమ్మట నో దేవా! దండతాడితభుజంగంబు భాతి, యేటుఁదిన్న కొదమసింగంబుకరణి సైన్యాధ్యక్షుఁడగు ఖరుండు ప్రళయకాల ఝంఝామారుతంబుకైవడి నాప్లవంగపుంగవుని సమీపించి సునిశితసాయకంబులు పుంఖానుపుంఖంబులుగ నమ్మర్కటాధమునురంబునఁగ్రుచ్చి, ఓరీ! అహీరావణంభవిక్రమా! మర్కటాధమా! రోముక, మేఘవల్లభ, మురాసులగు నస్మదీయసేనానాయకులకదన భూమిన నీవ విక్రమపరాక్రమాతిశయంబున కాలునిపురంబున కంపితివని గర్వింపకుమని మఱియుపదునైన నారసంబుల నావలీముఖంబునురంబుననాఁటి నీరసంబడఁజేసె. అంత నాబాణపాతంబునకు తాళజాలక పురంబునఁ గలప్రజలు డెందంబుల యందమందానందంబుపొంద నాతరుచరుఁడుతరువునరకిన వృతుంబుభాతినిలాతలంబునఁ గూలె.

మైరా—బళే! స్వామికార్యనిర్వహణాయత్తచిత్తా! ఖరా!

తే॥ గీ॥ స్నేహితులఁజంపినాడని చిత్తమందు
రవులు క్రోధానలంబు దూరంబుసేయ
హీను నామర్కటుని యిట్టెపీ నిశాత
సాయకంబులధరఁగూల్చి జయముఁగొనితె!

సేవకా! అటుపిమ్మట?

దుష్ట — దేవా! అరణ్యతో నేమైనది. అట్లాతలచుచుండు ధారుణీ తలంబునఁబడియుండ పునశ్శైన్య సముదాయంబులు సత్వరంబున వానవ చరుని రజ్జువులచేబంధించి దేవరసన్నిధానమునకుఁ దోడ్కొనిరాఁదలంచె. అంతలో నామర్కటుండు తెప్పరిల్లి తనచుట్టును గ్రమ్మియున్న దానవసైన్యంబుల నిధనంబునొందించి సైన్యాధ్యక్షుఁడగు ఖరునిఁదలఁపడి; ఓరీ! విధుకులకళంకా! వానవా! అనేకసహస్ర దానవసైన్యంబుల సంగరరంగంబున తీక్ష్ణనికృత్తాంగనిశాంతంబున కలిధులుగనొనర్చి యలసియున్న నన్ను పోరంబోరిఁగొని జయంబు వహింపవచ్చితివా? ఔరా! ఎంతసాహసంబున నరుదెంచితివి. రారమ్మనిహుమ్మని యురదంబుపైకుఱికి ఖరునికరంబుకరంబునఁగీలించి ద్వంద్వయుద్ధమునకుఁదలపడి సైనికులు నిర్వీరపాటునఁ జూచుచుండ, వేల్పులానందంబునఁ గాంచుచుండ, అనేకచిత్రరణ కౌశలంబులఁ జూపుచు, నిరువురునుఁ బోరాడఁ బోరాడ మన ఖరునిబలంబునీరసంబడె. వనచరుబలంబు ఘనంబునొందె. అట్లగుటయుతడవుగ యావానరుండు ఖరునివక్షస్థలంబున నొక్కగుద్దుగుద్ది ఘురాదులకుతోడుఁబొమ్మనిపీనినిఁ గూడ జముని గీమునకంపె.

మైరా — హా! దైత్యకులపరిచండ ఘోస్కరా! ఖరా!

తే॥ గీ॥ ఆలమునశత్రుఁగూల్చఁగఁ జాలుదనుచు
సంతసించితి నెంతయో స్వాంతమందు
తుదకు నన్నిట్లు దుఃఖాబ్ధిఁద్రోతువంచు
దలఁపలేదెప్డు నేను హృదంతరమున.

హా! ఖరా! నీవునన్నుఁ బాసిపోయితివా! (మంత్రితో) మంత్రి! భైరవా!

ఉ॥ ఎప్పుడువాకుఁబాసటయి మొన్నరాతుల సంగరంబులో
తప్పకకూలఁద్రోయుబలదర్పులు మేఘుఁడు నాఖురుఁడు, వా

మెప్పుల నెప్పుడుం గనెడి మేటివరుండును భండనంబునన్
తప్పులు సాఁగఁగూలిరిఁక కూడునె నేనిక ధాత్రి నుండుటల్.

భైర:— దేవా! ఊరడిల్లుఁ డూరడిల్లుఁడు.

మైరా:— మంత్రీ! భైరవా!

తే. గీ. అలమున నస్మదీయ భుజాగ్రరక్షి
తతను లై చెలువారు యోధతతు లకట!
పాడు శాఖామృగంబుచే భండనమున
భూమిఁ బడుచుండ యూరటఁ బొందు టెట్లు.

భైర:— దేవా! సంగరరంగంబునందలి సమాచారమంతయు నీచారునిచే విని పిదప కార్యకారియగు తెఱంగున ప్రవర్తింపవలయుఁగాని యీ యసమయ నిర్వేదన మేల? కావున దేవర యూరడిల్లి సంగతినంతయు గ్రహించుట యుత్తమము. సేవకా? నీ చెప్పఁదలంచినదంతయు నొక్కపరి వక్కాణింపుము.

దుష్ప:— అమాత్యవర్యా! దేవరయానతి ప్రకారం బెఱింగించెదఁగాక! రాజేంద్రా! అటుపిమ్మట సైన్యంబులకుఁగల్గు భంగపాటు నవలోకించి పంచముఖుండు షణ్ముఖుండో యనయావలీముఖంబునుఁదల పడి సునిశితసాయకంబుల నొప్పించి మట్టమధ్యాహ్న మార్తాండునిచందంబున రణరంగంబున నిలిచి యనేకకర్ణకఠోరవాక్యంబుల నొప్పింప తగుచరుండు పంచముఖు నవలోకించి; ఓరీ! పంచముఖా! ఏమంత్రిల గు మర, ఖగ! మేఘవల్లభుల పాలెఱింగియు నా పైకయ్యంబున కేల కాల్దువ్వెదవు, నీకు జీవనంబులపై నాస లేదా? అని యుల్లసంబు పల్కల మనంబు నెవ్వఁబల్కి తన హస్తంబుననున్న ఖడ్గంబు విసరివైచె. అట్లు భీకరంబుగ వచ్చు శస్త్రంబు మధ్యమార్గంబుననే తునిమి, ఓరీ! వనచరాధమా! బలహీనులగు ఖరాముల గూల్చుట ప్రజ్ఞకాదు. నన్నుఁగూ

ల్పము. నీ తెలివితేటలు బయలుపడునని ఆ వానరుండు క్రోధంబున కాననంబులదహించు కాలాగ్నిచందంబున మదకరీంద్రసమాజముపై దుముకు పంచాస్యకిశోరంబుచందంబున మండిపడి; పంచముఖునిపై దుమికి, పండ్లఁజీరియు, వాలంబునఁగొట్టియు నఖంబులరక్కియు కరంబులఁ బొడిచియు, పాదంబులఁదన్నియు ననేకవిధంబుల నొప్పింప పంచముఖుండును వైరిమార్గానుసరణంబుననే మెలంగె. అట్లు కొంతతడవు ఘోరంఘోర నాతరుచరుండు చూచువారలు చిత్తరువు ప్రతిమలట్లు చూచుచుండ యద్భుతంబుగ పంచముఖు నాకసంబునకెత్తి పాదంబులఁ బట్టి గిరగిరంద్రిప్పి భూమికిఁబెట్టికొట్ట నాదెబ్బతోడ పంచముఖుండు పంచత్వంబు—

మైరా— (దుఃఖముతో) హా! పంచముఖాదియోధులారా! హా! ప్రబల శాత్రవదుర్నిరీక్షణులారా! హా! రాక్షసకుల తమఃపారావార రాకాసుధాకరులారా! నాజీవనములారా! నన్నుఁబాసి పోయితిరా! ఇంక నేనెట్లుజీవింతును. నేనును మీతోడనే వచ్చెదను. నిలుండు. నిలుండు. (దుష్పధునితో) దుష్పధా! యుద్ధభూమికి దారితీయుము. (పోఁబోవును)

ధైర—(మైరావణుని పట్టుకొని) మహారాజా! మీరిచ్చటి కేగదరు! కాలంబుతీరుట పంచముఖాదియోధులు రణరంగంబున శరీరంబులఁబాసిరి. అట్టివారితోఁ బోవఁదలంచుట వెఱ్ఱిగాదే? అదియునుం గాక! బ్రతుకవలసిన కాలము కడముట్టువరకు జీవిసుఖంబుననో దుఃఖంబుననో కాలంబుఁ గడుపవలయునే కాని జీవంబులుఁ బాయఁదలంచి నను బాయఁజాలఁడు. కావున నో మహారాజా! మీరాకాసలేయుల వా సమీరనందనునకు సమర్పించి

ఆ॥ వె॥ మిగిలియున్నవారి మేదినీ తలముతో
పాలనంబు సలిపి ప్రబలుచున్న

వీరి మించఁగలుఁగు ధీరవర్యులుమీఁకు
సేవ సలుపరారె భూవరేణ్య,

మైరా.—అమాత్యవర్యా! ఇంక నే నెవ్వరినిఁ జూచుకొని యీ రసాతలంబు పాలింతును.

సీ. రోహాధవర్యుఁడు మేఘుఁడున్న వాఁడందునా
జముని కతిథియౌచు చనినవాఁడు;
మురుఁడు బాహాబల గురుమండెనందుమా
సురలోకమునుఁ జూడ నరిగె నతఁడు
ధీరుఁడు శురుఁడు సద్వీరుఁ డున్నాఁడన్న
సురవేశ్యల సుఖంబు మరిగెనతఁడు
పంచముఖుని శౌర్యమెంచనూ హింతుమా
దివ్యుల సౌఖ్యంబు తెలియ నరిగె;
తే. గీ. నింక నెవ్వరిఁ జూచి రోమా యీ ధరిత్రి
ప్రాణములు నిల్పుదును నేను స్థైరవుండ;
కానవారల పజ్జకు నేనుఁ బోదు
నాకు యుద్ధంబుఁ జెప్పఁగా రాకుమంత్రి.

ఎన్నఁడో మృష్టాన్నంబుల నిడెదరని పొట్టఁగాల్చుకొను నిర్భాగ్యుఁ డెవ్వఁడు. అదియునుఁ గాక, పగవహించి రేని నిశాచరులు తమ ప్రాణంబులొండె పెరప్రాణంబులొండె పోవు వరకు నూరకుండరుగదా! అట్టియెడ నే నా రామలక్ష్మణుల నావనచరున కెట్లియ్యఁగలను. కావనోయమాత్యవర్యా!

తే. గీ. ధైర్యమున నావలీముఖు దర్పమడఁప
నేను చనెదను; ప్రాణముల్ మేననున్న

మరల వచ్చెద; లేకున్న మామకీయ
పౌత్ర్య రాజ్యంబు దుర్దండికట్టికిమ్ము.

పిదప నాయెడల నీవిప్పు డేవిధంబున భక్తి శ్రద్ధలుగలిగి మెలంగు చున్నావో యావిధంబుననే నీలమేఘుని యెడల మెలంగుచుండుము. నత్యవథంబు విడువక యాతఁడు రాజ్యనిర్వాహణదక్షుం డగువరకు నీవ యీరాజ్యంబు పాలింపుచుండుము, ఇంక నీవేగుము. నేను రణరంగం బున కరిగి శాత్రవుని నుక్కడంచెద.

భైర—దేవా! మీరరిగిన పిమ్మట నేనుండి ఫలమేమి? నేనును మీవెనువెంట రణరంగంబున కవతరించి స్వామి కనుచరుఁడన్న నుడి సార్థకమొనరించుకొనెదఁగాక;

మైరా—అమాత్యవర్యా! ఆనీలమేఘుండు నేననియెంచి స్వామి కనుచరుఁడన్న మాటసార్థకమొనరించుకొనుము, నాయానకడ్డు వల్కితివేని పుణ్యలోకముల కుందప్పినవాఁడ వగుదువు, దుష్పథా! పొమ్ము.

భైర—దేవా! దేవరయాజ్ఞాబలమే నన్నంపుచున్నది. (తనలో) ఆహా! ఈరాశేంద్రుండెంత చెప్పినను వినక యానవీరనందునునితోడ యకారణకలహంబుఁదెచ్చుకొని భటామాత్యమిత్ర సంఘంబుల నెల్ల చంపుకొనుచున్నాఁడు. ఏమిచేయుదును. దైవలిఖితంబన్యథా యెట్లు వర్తిల్లును. కాఁదలఁచిన కార్యంబున కెవ్వరు కర్తలు? నేఁబోయెదఁగాక.

(నిష్క్రమించును.)

మైరా—ఓరోరీ! నిజభుజాదండమండితవైరివీరా! వాయు నందనా!

చం. విను రణరంగమందునను నిర్జరనాయకుఁగూడి లేవలే
యనిమెనఁగూలి నాదవొకో హా! వవమాన కుమారరత్నమా!

యని కడుదుఃఖమంది తమ కగ్గలమై విలసిల్లు ప్రేమ చే
తను నిను, జేరునట్లుగను ధారుణిం గూల్చెద నో వలీముఖా!

అట్లు చేయనేని,

తే. గీ. వైరిభీకర దైత్యవంశంబునందు
జననమందంగ లే; దింకఘన బలాఢ్యుం
డైన కంటక పుత్రుండంగాను; శాత
ఖడ్గమే బూనలేదు నాకరమునందు.

ఓరీ సేవకా! నామాటలుంగా సూతునితో సర్వాయుధ సంపూర్ణంబగు కాంచనరథం బలంకరింపుమనుము.

సేవ—చిత్తము (నిష్క్రమించును.)

మైరా—(ఇటునటు తిరుగుచు నాలోచించుచుండును.)

సూతు—(ప్రవేశించి) దేవా! అరదంబు హజారంబుకడ దేవర రాకకై వేచియున్నది.

మైరా—ఇదే నేనును వచ్చుచున్నాను. (కోపముతో) అరే వానరకీటకమా! కాచుకొనుము.

(నిష్క్రమించుచున్నాఁడు.)

ద్వితీయరంగము:—కాళికాలయము ముందరి బయలు

(దుర్గండితోఁ హనుమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

హను—సోదరీ! ఎంత చెప్పినను నీచింతమానవు కదా?

ఉ. అలములోన నాఖలుని నాకుటిలాత్మునిఁ గూలనేసి నీ
బాలకు నీలమేఘు గుణవంతుని రేనిగ నీరసాతలం
బేలఁగ జేతు నేనిటుల నేటికి యింకను చింతఁ బొందెదో
చాలు; శమింపు; కన్నఁగవ సత్యముఁ బాయును సోదరీమణీ,

దుర్దం—సమీరనందనా! నాకెంత శత్రుభావంబున మెలంగినను పాతాళలంకేశ్వరుండు సోదరుండు గదా! అట్లగుట నాతండు ససైన్యంబుగఁ జచ్చుచుండ నాకు దుఃఖంబు గలుగకుండునా?

హను—సోదరీ! ఎవరి కర్మంబునకు నెవరు కర్తః. నాచే సైన్యంబులన్నియు జీవంబులుఁ బాయుచున్నను చింతింపక మూర్ఖత్వంబున నన్ను సంహరింప నుపాయం బూహించుచున్నాఁడు కదా! అట్టి మూర్ఖుని విషయమై చింతించెదవేల? చింతించి నీచేయఁగలదేమి?

దుర్దం—ఏమియును లేదు.

హను—ఇంక నీసోదరుని బలంబులెన్నియుండును?

దుర్దం—దేవా! చెప్పెద నాలకింపుఁడు. ఇప్పటి కాతని సైన్యంబులన్నియును సైన్యాధినాయకులతోడ దేవర భుజాదండంబున సంగ్రామరంగంబున నిధనంబు నొందినట్టులే! ఇఁక మిగిలిన వారొక శతసంఖ్యాకులుందురేమో!

హను—అట్లయిన సోదరీమణీ! ఇంకనేల నాదుష్టనిశాటుండు సంగరరంగంబున నన్నుడీకొన నాలసించుచున్నాఁడు? కపటోపాయంబులే వేనిపన్ని యీరాజేంద్రుల మ్రిందింప నెంచుచుండునా?

దుర్దం—దేవా! నాసోదరుఁడట్లే యూహించుచుండునని నేఁ దలంచెదను. ఏలయన, దేవర ప్రభావంబునకు చతుర్దశలోకంబుల నొక్కటరికబలింతంగల దశవాయిలు దశసహితంబుగ వసుంధరావలయంబునఁ గూలుటయే, (అటునిటుఁజూచి) దేవా! అదేమదీయ సోదరుండు సర్వాయుధసంపూర్ణం బగు కాంచనరథంబు నధిష్ఠించి దేవరతోడ కయ్యంబున కరుదెంచుచున్నాఁడు. దేవర యప్రమత్తులై వాని నెదిర్చి జయలక్ష్మినిఁ జేకొనుఁడు.

హను—కాంతా! చింతిల్లకుము. నాభుజాబలంబున నీసోదరుని యమసదనాభిముఖుం జేసి జయలక్ష్మినిఁ జేకొనెద. ఏలనన,

మ. కుటిలాచారులు, దుష్టవర్తనులు, రక్షోవంశజుల్ గావునన్
పటుదర్పంబున జన్యరంగమున నబ్బాహాబలో పేతునిన్
పటుమాయాబలుఁడైన దైత్యవిభునిన్ భామామణీ! పోరునన్
భటసంఘంబులతోఁడ గూల్చెదను నాబాహా బలప్రౌఢిచేన్.

దుర్గం—దేవా! అట్టంను నాకన్నునాని కారాగృహంబున నిల్పి, నన్వినరాని దుర్భాషలఁ బల్కి, తుదవరాని కష్టంబులఁ గుడుపు చున్నాఁడు. ఎట్లయినను నన్నాతని బాటినుండి రక్షించి నాప్రాణముల నిల్పవేఁడు కొనుచున్నాను.

హాను—సోదరీ! ఇంకను నీవు భయవర్జితవుగా లేదా? ప్రభాక ర, నిశాకర, భూ. మ్యాకాశాదిభూతంబులు సాక్షులుగ.

మ. తరుణీరత్నమ! నీకుమూరకుని పాతాళాధినాధుండుగా
సురలెల్లం జయ పెట్టనేలు నటులన్ శోభాయమాన ప్రభా
వరులై సర్వనిశాచరుల్ గొలుచుచోటన్ నిల్పువాఁడన్! యిఁకన్
సరసీజాక్షిరో ఓంతనొందకుము నీస్వాంతంబునందించుకేన్

(తెరలో)

మ. అని నాసైన్యముఁగూల్చి నంతటనె నీవాహ్లాదముం బొందగాఁ
జనునే క్రూర! వనేచ రాధముఁడ! నీచా! నిన్ను భూతంబులున్
ఘనసంతోషముతోఁడ మెక్కఁగను సంగ్రామంబులో గూల్చినే
ఘనకీర్తిన్ గొనవచ్చుచుంటి నిలుమీ కాలూది దుర్మానరా.

హాను—సోదరీ!

ఉ. ఆలములోన సైనికుల నందఱఁ గూల్చితినంచు రోషమున్
చాలగఁబూని వచ్చెడి నిశాచరుఁడల్లదె యేటువడ్డ శా
ర్దూలములీల నార్చుచును దూషణవాక్యము లాడుకొంచుదు.
ష్కాలము చేరువాటకనుఁగానక నన్నదిద్రించునూ హ.చేన్.

కావున నీవు సత్వరంబున కాళికాలయంబు ప్రవేశించి యువతులజూలఁ బ్రాణపదంబుగఁ గాపాడుచుండుము. నేనును.

తే. గీ. అలమున నీదు శత్రువునవనిఁ గూల్చి
పిదప నీపుత్రుని సింహపీఠి నునిచి
రామలక్ష్మణులనుఁ గొని లేమ నేను
పోవువాఁడను లంకకు పొలుపు మిగుల.

దుర్గం—దేవా! మీరు రణంబున నప్రమత్తులై యావాగురిం జిక్కక జయంబుఁగనుడు. సుంతైనను మీ రేమఱిన వాని జయించుట దుర్ఘటము. నేను దేవర యాజ్ఞాప్రకారంబు దశరథరాజసూనులను కాపాడుచుండెద. దుష్టశిక్షణ శిష్టరక్షణ దీక్షాపరతంత్రుఁడగు నరహరిచందంబున యానిశాచరుమదం బడఁగించి నన్ను రక్షింపుఁడు. నేనిదే పోవుచున్నదాన—(నిష్క్రమించును)

(అంతసూతసహితుండగు మైరావణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

మైరా—(ప్రవేశించుచు) ఓరోరీ! అఖర్వగర్వాయత్తచిత్తా! మారుతిపుత్రా! "మా" అని వా సైన్యము" అనుపూర్వోక్త పద్యమును చదివి, సూతా!

చ. అరదము పోవనిమ్ము ఖలువాదురితాత్ముని, మర్కటాధమున్
దురమునఁ ద్రెళ్ళ నేసి ఘనదోర్బలుఁ డీతఁడటంచు కాత్రిపుల్
కరములుమోడ్చి మ్రొక్కునటు గ్రన్ననసల్పెద సత్వరంబడన్
తురగచయంబువే పరువత్తోలుము వానరుగుండె ఝల్లనన్.

అట్లరదంబు సత్వరంబుగ నడుపకుండిన యామానవులను శక్తికి భుక్తిగ నొనర్చుట యాలస్యంబగు (ఎదుటచూచి) ఓరే! మర్కటాధమా!

ఉం. దురమున నాదు సైనికుల దోర్బలశక్తినిఁ గూల్చితంచునో
తరుచర! సంతసింపకుము, దానవనాయకుఁ గెల్వనౌను రా

సురులకునైనఁ జెల్లదు; త్రిశూలికినైనను చేతఁగాదు శ్రీ
కరరణరంగమందునను ఖడ్గము చేతనుఁదాల్చి నిల్చినన్.

హాను—ఓయీ! భుజబలాటోపశత్రుభూధర సైన్యవిచ్ఛేద
నా! రసాతలాధినాథా! ఆలంబున భగతుఁ విగత ప్రాణులఁ జేయఁగల
నని విఱ్ఱవీఁగక నాచెప్పఁబోవునది సావధానుఁడవై వినుము.

చం. దశరథరాజ సూనులను, ధర్మచరిత్రుల, సత్యమూర్తులన్
అనమశరాసనోగ్రుల; సహర్పతి తేజుల, పుణ్యమూర్తులన్
విశదహిమాంశు సత్కళుల, వీరవరేణ్యుల, కీర్తిసాంద్రులన్
విశదముగాఁగ నాకు నిడి వే యశమున్ ధరఁగాంచు దానవా!

మఱియు, నీవు,

తే. గీ. దుష్టులైనట్టి వారలతోఁ బొక
సత్యపథగామివై యీరసాతలంబు
ప్రళయకాలంబు దాఁకను పాలనంబు
సలుపుకొనవయ్య ప్రజలెల్ల బలసికొలువ.

ఇప్పుడు నీవునిర్బంధించిన శ్రీరాముండు చతుర్దశభువనరక్షణదీక్షా ద
క్షుఁడగు శ్రీమన్నారాయణుఁడుగాని మానవమాత్రుండుగాడు. కావున
నీవాసుగుణసాంద్రుని తమ్మునితోఁగూడ నాకర్పించి

మ. మనుమార్గంబునుఁ జూచుకొమ్ము సమర వ్యాపారమున్ వీడి యీ
మనువంశాంబుధి సోము పాదములు నీమంబొప్ప నీభావమం
దున నెల్లప్పుడుఁ గొల్చుచుండు మపుడీ దోశ్శక్తి కీర్తింగనున్
దనుజా! నిక్కముఁ దెల్పెనాఁడ వినుమా దాక్షిణ్యభావంబునన్

అట్లు చేయవేని నాచే సంగరంబున యమాలయాభిముఖుండ వగుట
నిశ్చయము. కావున ప్రాణంబులపై నాశకలదేని-

తే. గీ. దశరథాధిపు పుత్రుల దైవసముల
ధీరతమ, బిరుదుల దనకరండ్రి,
వంశజులఁదెచ్చి వాకిచ్చి బ్రతుకుమీవు
ప్రిథితగుణసాంద్రి. మాయ రావణసరేంద్రి!

మైరా—ఓరోరీ! అఖర్వ గర్వాయత్త చిత్తా! మదోన్మత్తా! ఏమంటివి. దుష్టులదారిఁబోక సత్యపథగామివై రసాతలంబేలుకొనుమనియా! నేను దుష్టపథవర్తినియును నీవు సత్యపథవర్తివియునా! అదియునుంగాక నీవు పేర్కొన్నవారలు హిరణ్యాక్షాది దితిజులేకదా! తక్కినవారలు పుణ్యాత్ములేమి? వినుము.

ఉ. జ్యారణటంక్రియానినద సారము వీనుల సోకినంతనే
ధీరతవీడి దేబెలయి దిక్కుల సుక్కుచుఁ డాగబోవు నా
వీరుల సంగరంబునను విక్రమమేర్పడఁ గెల్వఁగూడదో
మారుతినందనా! వినుము మామకపల్కులు శ్రద్ధతోడుతన్

నిన్నుంబోలు హీనమానవులకెల్ల పరాక్రమశూన్యులగు వీరహృదయులు సజ్జనులుగను చతుర్దశభువనంబులవలీల భుజావిక్రమంబున జయించి చతురతతో చాతుర్వర్ణజనాహ్వాదంబుగ నిజభుజాదండాగ్రంబున ధరించి పరిపాలించు పరాక్రమోద్భాసితులు దుష్టులుగను కనుపించుచుందురు. "లోకోభిన్నరుచిః" అన్న సామెత వసుంధరావలయంబున క్రొత్తది కాదుగదా!

తే. గీ. ధరణిగల మానవులకు సంతసమొసంగు
కలువహితుఁ బట్టిపోయరె కమలముఖులు
ధీరవరులనుఁగని మది దిగులుఁజెంది
క్రూరులను వాదుగల్గింత్రు కుమతులెపుడు.

దాని కేమిగాని, నివేల నాపురంబు చోరునిగతిఁ జొరఁబడితివి? అట్లు జొరఁబడినదియె కాక నాబలంబుల నిధనంబొనరించి నేను నిర్బంధిం

చినరాముండు మానవమాత్రుండు గాఁడనియు, శ్రీమన్నారాయణుం డనియు నుపన్యసింపఁ గడఁగితివి. సృగాలంబు పరమభక్త వశంకరుం డగు కైలాసనివాసుండగునేని యీరాముండు మునిజన హృదయార విందుండగు పక్కివేల్పగును. ఒకవేళ నీతలఁచినట్లీతఁడు యాదిదేవుండని జనంబులచే నుతినొందు విష్ణుదేవుండేయయిన,

మ. చిరకాలంబుననుండి రాక్షసులకున్ జేఁజిక్కకే మాయచే
నరవింజీవముఁ దాల్చినట్టి జడునిన్ ఖండాలునిం క్రూరునం
గరరంగంబున వేల్పులెల్లరును వేగన్ చింతచేఁ జావగన్
పోరిగొందున్ మదభీష్టముల్ సఫలమై పొల్పొందగాఁ మారుతీ.

హను — ఓరసాతలాధినాథా! సకలజనులకును సంతోషదాయకులగు వారు బలహీనులైనను అధర్మప్రవర్తకులు ధైర్యసాహసపరాక్రమ వంతులైనను యెవరుమెత్తురు? అది యట్లుండనిమ్ము. నీవు

ఉ. దొంగవిధాన వచ్చితని తోఁచినయట్టుల నీకుఁజెల్లు న
ల్కంగను రాత్రియేకదర లంకను మాకపిసేనఁజొచ్చి యా
యంగజరూప సన్నిభుల నాయినవంశుల దొంగిలించివే
గంగయి కొంచువచ్చితివి; కాని తలంపవు దొంగబుద్ధతుల్

మఱియు మీనిశాచరకులంబున చోరత్వంబు లేనివారెవ్వరు? దానికే మిగాని ఓనాగలోకాధినాధా! తలకు మీరినబింకములకుఁ బోక నా పలుకులు వినుము. నీవుదొంగిలించి తెచ్చిన రాముఁడు.

సీ. కురులుముడుచు నీడు కుదురుగా లేనప్డె
తాటకనిలఁగూల్చి తనరినాఁడు;
గాధేయు జన్నంబుఁ గాచెడివేళను
బాహుముఖ్యులనట్టె పట్టిచంపె;

భూమిపైఁ గలనెల్ల భూపు లెత్తఁగ లేని
శివు కార్ముకంబును చిటికెఁ ద్రుంచె;
ఖరదూషణాదుల కారుకానలలోన
దునుమాడి మెప్పును గొనినవాఁడు;
తే. గీ. రావణానుజు ఘటకర్ణు లావుమిగిలి
యున్న నే నక్కడంచి పేర్గన్న వాఁడు;
యట్టిధీరుని శ్రీరాముఁ డిట్టవగుచు
దొంగిలింపఁగఁ జెల్లునే దోసకారి.

అంతతోఁ బోక నీవిప్పు డారాముండు నాచేఁ జిక్కి యున్నాఁడు. బలవంతుఁడైనను నన్నుమార్కొన వశముఁ గాదుగదా? యని తలంచుచున్నావు. కాని యట్లు తలంచుట పిచ్చివానికోరికల విధంబగును. ఏల యన; అఖిలలోకరక్షణ దీక్షాపరాయణుండగు లక్ష్మీశ్వరుఁడు నీచే జిక్కియు తాను.

ఉ. క్రూరుల పాపకర్ములను ద్రుంచి ధారుణిఁ గూల్పఁజాలున
వ్వారల హృత్సరోజముల వాసముచేయుచు మించుచుండి, యా
క్రూరులవంశముల్ ధరణి కుంకట వెళ్లుట లేకయుండఁగా
ధీరతఁ జేయఁ జేయ యికఁ దెల్పెడి దేమి నిశాచరాధిపా.

మైరా—ఓహోహో! అదియా కారణము. నేనెఱుఁగఁ జాలనందులకు మన్నింపుఁడు. అసరవరుండిప్పుడీతరుచరున కావేశించి చటుల భీకర సంగ్రామరంగంబున కుఱుకుమని ప్రోత్సహించుచున్నాఁడు కాఁబోలును. పాపమారాముండెంత దురదృష్టవంతుఁడో కాని పురంబుల వసించు వారల సాయముఁ గోరక మహారణ్యమధ్యంబున కందమూలఫలాదులఁ దినుచుచుండు మీసాయము కోరుకొనెను. ఓరీ! వానరా! నేనొక్కమాట చెప్పెదను వినుము. నీజాతి కిపండ్లుకదా కావలయును. కావున.

ఉ. భీతిమనంబునన్ గొనక ప్రేమ ననీవును మత్పురంబులో
నాతతపుష్పజాలసము దంచితదివ్యఫలాళితోఁ దళో
ద్భాతిశయంబుఁగల్గియెది భాసిలఁజేయుమనంబుమావనిన్
ప్రాతిగనున్న కాయలను బాగుగ మెక్కుచు నుండువానరా!

శీఘ్రగమనంబునఁబొమ్ము. ఎవ్వరైన నడ్డగింతురేని నాయాజ్ఞయని నుడువుము. అదియునుంగాక! ఓవలీముఖా!

ఉ. వానరులేడ! యస్త్రకరవాలములుంగల సంగరంబులో
కానగవచ్చులేడ! రిపుఖండనచండపరాక్రమార్కులౌ
మానవనాథులేడ! కపిమాత్రులసాయముఁగోరుటేడ! నో
వానర! యేల యీగతిని బల్కెదునాయెదుటన్ యసత్యముల్

హను—ఓరోరి రజనీచరాధమా! అసత్యంబులు పల్కుట మీనిశాచరులకుఁ జెల్లుఁగాని మావంటి వారికిలక్షణముగాదు. అదియట్లుండనిమ్ము. వానరులు సంగరరంగంబులఁగనఁ బడరేమి? ఓరీ! వివితాళవా!

చ. మునుతపశ్శోకఁజుట్టియశముంగొన నెంచియు రావణాసురున్
మునుకొనివార్ధులేడిటను ముంచెనుమూర్ఖుఁడ! కోతి యేనుమీ
వినుదనుజాధమా; యిపుడువీరుని నిన్నునుబోరఁగూల్ప చ
య్యనచనుదెంచినాఁడ యశమందెదొ దానినివీఁడనాడెదో.

నీవునన్నెవ్వరిగఁ దలంచి యిట్లుపలుకుచుంటివో నావృత్తాంతము చెప్పెదను వినుము.

సీ. త్రిపురంబులంగాల్చి దేవతావళిచేత
ప్రఖ్యాతిఁగన్నట్టివాఁడెవండు?
భక్తమార్కండేయు బలితంపుప్రేమచేఁ
గాపాడిఘనుజముఁ గొట్టెనెవఁడు

సురలదైత్యులఁ బోవకరము మదంబున
కాలకూటవిషంబు గోలెనెవఁడు
రజతాద్రినెత్తిన రావణునేద్పించె
బొటవ్రేలగిరి నొత్తిదిటలనెవఁడు
తే. గీ. భక్తులకు పెన్నిధానమైవరగు నెవఁడు
అట్టిధీరుని గట్టుల పట్టిమగని
యవరరూపంబుగానన్నుఁ వాత్మఁదలఁచి
మాటవినిమను! తెలిచో మనవునమ్ము.

మైరా.—ఓరోరీ! వానరాధమా! ఇదివర కొక్క రాముఁడే దైవంబని చెప్పవింటిని. ఇప్పుడు నీవుకూడ దైవంబవని చెప్పకొనుచుంటివా? ఓరీ! వాచాటా!

తే. గీ. నీలకంఠుని రూపంబు నే నయంచు
పలికినంతనె భయమందు పందయెవఁడు?
భీరులకుఁజెప్పి భయపెట్టు; ధీరమతుల
చెంతఁ జెప్పఁగబోకు మీచెనటిసుడులు.

ఒకవేళ తలఁచినట్లు నీవు శివుఁడవేయైన

తే. గీ. పౌరుషంబున నిఁకుఁగూల్చి ప్రబలినయెడ
త్రిభువనంబుల ప్రఖ్యాతి విభవమమరు;
నటులఁగాక నీచేత నేనంతమొందు
యెడల స్వర్గసుఖంబుల నెనఁగువాఁడ.

కావుననిన్ను రణరంగంబున కూల్చుటొండె నీచే జీవంబులు పాయుటొండె నిశ్చయంబు. రణరంగంబున కరుదెమ్ము. సూతా! రథమాయితలికి తోలుము?

సూతు.—చిత్తము. దేవరయాజ్ఞ ప్రకారమొనర్చెదఁ గాక! (రథముతో నిష్క్రమించుచును.)

హను—మూర్ఖులను బాగుచేయ నెవ్వఁడోపును?

తే. గీ. ఇద్భువచే సజ్జనుల కెట్లొ నచ్చఁజెప్ప
వచ్చు దుష్టులకుం జెప్ప వారలెవరు!
చెలగి మూర్ఖులమనను రంజింపఁజేయ
నలువకే కాదు వేనోళ్ళ చిలువకగునె.

కావున నేనును రణభూమికే గెదఁగాక!

(నిష్క్రమించుచున్నాఁడు.)

ఇది చతుర్థాంకము.





శుభమస్తు.

శ్రీరామచంద్ర.

# మారుతివిజయము.

## పంచమాంకము.

(నీలదేవుఁడు ప్రవేశించుచున్నాఁడు)

నీల—(తనలో) అబ్బబ్బా! వాయునందనుని సందేశము శిరంబునఁదాల్చి కపిసేనంజొచ్చి వారి పరాక్రమముఁ గాంచినది మొదలు మన్మనంబానంద వారినిధి నీదులాడుచున్నది. ఆపరాక్రమము వర్ణింప వేయినోళ్ళ చిలువకైనను దరంబుగాదు. పుట్టెడు దుఃఖములోనుండియు దశకంఠుబలంబులకు లొంగక పోరుచున్నారు. ఆదళంబులయందు శత్రుకానన దవానలుండగు నీలుండును వైరికృతవ్యూహవిచ్ఛేదన సమర్థాంగుండగుయంగదుండును భీకరతిమిరంబుల నిమేషమాత్రంబున గిరి గహ్వరములకు పాఱఁద్రోలు ప్రభాకరునకుద్దియగు ప్రభాకరాత్మజుండును, మొదలగు యోధులెందరో కలరు, అట్టిదళంబులు గనుకనే రాముండు సురాసురుల కజేయుండగు పంక్తికంఠుని భీతావహునిఁ జేసినాఁడు, ఆకపిసైన్యముఁ గాంచినంతనే చతుర్దశభువనవిజయవిక్రమాఢ్యులగు వైరివీరులు పటాపంచలై పారవలసినదే! కాని సంగ్రామరంగమున నిలువతరమగునా! (తూర్పుదిక్కు తిలకించి) ఆహా! ఆనందంబున కాలంబుసహితము తెలియఁజాలనైతిని. అదె సకలలోకహృదయానంద కరుండగు కమలమిత్రుండు ప్రాగ్గిరినధిష్ఠింపఁ బోవు

చున్నాఁడని తెలుపుటకో యన నిజకాంతిపుంజములు వెదజల్లుచు ప్రాగ్భాగంబున ప్రకాశించు వేగుజుక్క. నేనిదేవిధంబున మహదానంద మత్తుఁడనై యాలసించుచుండిన మహామహులుండగు ప్రభువారనందనుఁడు నాపై కోపింపవచ్చును. కావున నేనును సత్వరంబున పోయెదఁగాక!

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

---

ఇది ప్రవేశము.

ప్రథమరంగము—కారాగృహము.

నాగపాశబద్ధుఁడగు నీలమేఘుఁడు (ప్రవేశించుచున్నాఁడు)

నీల—

శా. ఓ కైలాస నగాధివాస! అభవా! యోపార్వతీ నాయకా!
ఓకాకోదర భూషణాంకిత! శివా! యోభక్తమందార! యో
లోకాధీశ! సమస్తపాపహరణా! లోకప్రియంభావుకా!
పాకార్యాది సమస్తదేవవినుతా! పాలింపు నన్నీశ్వరా!

ఉ. నమ్మితి నీపదాబ్జముల నామనమందున నిశ్చలుండనై
నమ్మగలేదు వేరొకరి నామనమందున చంద్రశేఖరా!
రమ్మ యశంబుగొమ్ము సుకరంబుగ నాచెఱమాన్పి మెప్పులం
గొమ్ము త్వదీయసద్యశ మకుంఠితరీతి వెలుంగ ధాత్రిపై,

తే. గీ. కాచితివినీవు భక్తుల కరుణతోడ
ననుచు వింటినిదైన నాపాపమేమొ
చెఱనుఁజిక్కి చింతించు నన్నరయవైతి
భక్తరక్షణ బిరుదాంక పార్వతీశ.

ఓదేవా! నీవేల నన్నుఁగాపాడక విడనాడితివి, రాక్షసకులుండనని సందేహించుచుంటివా? ఇదియేటి న్యాయము. రాక్షసుఁడైనంత మాత్ర

మున దుర్బుద్ధియగువా? తదితరుఁడైన సద్బుద్ధి యగునా! ఓ దేవా! నన్నుఁ గాపాడసామర్థ్యము లేక యూరకుంటివా! అయ్యో! ఆర్తావన రక్షణమన్న ఖ్యాతి వారును ముంతంజ వేయుదురే? తమ సర్వస్వంబును ధారఁబోసి విఖ్యాతిఁగాంచెదరే? అట్టియెడ సర్వలోకపూజనీయుండ వగు నీవిట్లూరకుండుట భావ్యమగునా! రక్కసికోలంబులకెల్ల దైవం బనీవగావే! నిన్నుఁ గాదని నిశాచరులు యేసమయంబునన్నైనను వేరు దైవతంబుల నారాధించిరే! నన్నుఁగాపాడ మిామనంబేల త్వరపడక యున్నది.

మ. జననంబాదిగ కష్టనారములనే సంప్రాప్త మానట్లుగాఁ
నొనరం జేసితి; వింక నెన్నటికి నేనూహింతు విద్యావినో
దసఖ్యాతి; భవద్వి చిత్రములకే స్థానంబనే! కావవే!
నినుధ్యానింతు నిరంతరంబుమదిలో నిత్యాను మోదుండనై.

హా! కాంతా! మంజువాణీ! మనకీజన్మంబున దాంపత్యము లభింపదు కావున.

చ. వనితరో! ప్రేమ నావయిని బాయుము వేరొక రాజపుత్రునిన్
మనమునకోరి వానిని ఘనంబగు సౌఖ్యమునందు తేల్చినీ
జననము సార్థకంబుగను సల్పుము కీర్తిమహీతలంబునన్
ఘనముగ నిల్పుకోఁదగును కామిని! నాయుడిమాన వీనుమా,

అయ్యో! నేనెంత వెఱ్ఱిని. పార్వణపూర్ణిమాచంద్రునింబోలు యూన మొహ్నము చక్కదనంబును, తమ్మిరేకుల పరిహాసింపఁ జాలు నానేత్రములసొగసును, ఆవయ్యారి నడకలతీవియు మరతునన్న నావశమగునా! జన్మించిన దాది.

తే. గీ. బొందులునురెండు వేర్వేర పొదలుచున్న
ప్రాణమొక్కటిగా మేము బ్రతికినాము

యట్టియెడనట్టి దుర్భాష లాడనేను
పాలుఁబడితిని దైవమా! పాపినగుచు.

ఓసుందరిమణీ! మంజువాణీ! నిన్ను చేపట్టి యమందానందంబున నీదు లాడ దలంచిన నాకెంతలో నెంతటిపాటు వాటిల్లెను! నేనేమి చేయుదును. దైవవిధి కెవ్వరుకర్తలు! అయినను.

ఉ. అక్కట! మిక్కుటంపువల పాత్రతవుల్గాని నన్ను వేఁచుటన్
చక్కరబొమ్మ నీచెలిమి శాశ్వతమౌనని యింతకాలమున్
నిక్కము ప్రాణముల్ నిలిపి నేవిడనాడక యుంటిదేహ మిం
కెక్కడనేనుఁగాంతు తరుణీమణి! నీయెడపొందు సౌఖ్యముల్.

ఇట్లీ కారాగారంబున నాగపాశబద్ధుఁడనై యున్నను నేను నీవలన సుఖంబులుఁ గాంచఁగలనని యింతవరకు తలంచితినిగాని యిప్పుడు

కం. నిక్కము గ్రహింపఁ జాలితి
దక్కవు నాకింక నీవు తరుణీమణిబల్
రక్కసినీ జనకుఁడు కడు
చిక్కులఁబెట్టును నొకింత చింతింపకనిన్.

అయినను కాలానుగుణ్యంబున పరరాజకుమారుల ప్రేమించి

ఉ. చిన్నతనంబునందు కడుస్నేహమునన్ చరియించినంతవా
క్రొన్ననఁ బ్రాయమున్ గొనగఁగోర్కె మనంబున నిల్పివాఁడు తా
నెన్నివిధంబులన్ దలచ నేనియు లాభము లేదటంచునో
కన్నరొ పుణ్యమార్గములఁగాల్పకు కాయము వేదనన్ బడన్.

మఱియును, పతిలేని సతిగతినిరర్థకంబని తలఁచి స్వప్రాణాపహార పరాయణవగుదువేమో; అందుకు మాత్రమెట్టి భీకరాపదలు శిరంబునఁబడి డెందమును గలంచుచుండినను ప్రయత్నించకుందువని నమ్మ

చున్నాను. అత్మహత్యసర్వసుఖంబులకును వినాశనహేతువగు కారణముగదా!

(భైరవుఁడు ప్రవేశించుచున్నాఁడు)

భైర—(తనలో) హా! చతుర్దశభువనైకవీరా; మైరావణ నృపాలా!

చ. తనయునిఁ గోరనంచు గుణధాముని మేనమఱందిసూనునిన్
 పనిఁగొని నిద్రలోననిడి పాములఁ బెట్టితి; స్వర్గలోకపా
 లునిశచినాథుఁ గెల్చితివి; లోకత్రయంబకులైన మానులన్
 పనిఁగొనిఁ కట్టికొట్టితివి ప్రాజ్ఞులు భీతిల నెమ్మనంబులన్

అట్టిసాహసవంతునకు నేడట్టిపాటు సంభవించె. కటకటా! భువనాధీశులచేతనా; దేవాదిదేవులచేతనా; దైత్యదానవానీకంబుల వల్లనా! కాదు. కాదు. నీచమర్కటంబులచేతనా జీవంబుల బాసితిరి! అయ్యో! మహారాజా! దండధరుదండంబించుకంతేని లక్ష్యంబుచేయక నిలచిన మీప్రాణంబు లాతరుచరువాల ప్రహారంబుల దేహంబునుండి తొలంగెనా! ఇంక రాక్షసకులంబునకు దిక్కేడి. చలిచీమసహిత మిఁక రాక్షసులకు ప్రాణాపాయముఁ జేయ నూహించునుగదా! కాలచక్రము యొక్క విచిత్రములిట్టివియే కదా! అయ్యారే!

సీ. తొలిహేమకశిపుచే విలసిల్లి యామీఁద
 బలిచక్రవర్తిచే ప్రతిభఁ గాంచి
తరువాఁత మాల్యవంత బలాబ్ధి పేరంది
 పిదప విలోచను పెంపుగాంచి
ఆమీఁద త్రిపురంబులావరించిన యట్టి
 వీరసోదరులచే విశ్రుతిఁ గని
కాలకేయాదుల కౌఁగిలింతలవాఁడి
 యలహయగ్రీవుచే బలిమినంది

తే. గీ. చెలఁగుచున్నట్టి దానవకులము కిలను
కటకటా! యెట్టికష్టంపుకాలమయ్యె
ప్రబలవర్షర్తువందున ప్రబలినదులు
మందువేసంగి క్షీణించుమాదిరిగను.

(ఆలోచించి) ప్రబలప్రతాపుఁడని పద్మనాళంబున నిలిపిన మత్స్యవల్లభుఁడేలనో వీనిని విడచినాఁడు. తులాసంరక్షణార్థముండిన దానవులైనను యీవానరుని నిర్జింపఁజాలరైరి. దైవలిఖితమిట్లుండ నెవరేమి సేయఁగలరు. (ఆలోచించి) దుఃఖావేశంబున సర్వంబును మఱచిపోయితిని. మారుతతనూజుఁడు రుద్రావతారంబని యెఱింగియు యిట్లు చింతింపవచ్చునే; రాక్షసరాజచంద్రమా!

ఉ. కాలికమూర్తియీపవనుపట్టి కపీంద్రుఁడుగాఁడు! అద్రిజా
లోలమనోధవుండనుచు భార్యవచింపవినంగవైతి. నీ
కేలరణంబటంచకట నేను వచింపవినంగవైతి! భూ
పాల! సమస్తసైన్యముల పజ్జను నీవును స్వర్గమేగితే!

అయ్యో! చేయవచ్చిన కార్యంబు మఱచి యిట్లు చింతించుచుంటినేమి; మాతంగీ మహారాజ్ఞిగారియాజ్ఞనెరవేర్ప సత్వరంబున కారాగృహంబున కరిగెద గాక! అదెదండ ధరకింకరుల పురికింగొనని కారాగృహపాలకబృందము. వారిని సమీపించి దేవి నిర్దేశంబెఱింగించెదఁగాక! (కారాగృహాధికారిని సమీపించి) కారాగృహాధిపా! నీలమేఘుని చెఱనుండి తీసికొని రమ్ము.

కారా—అమాత్యవర్యా! వానినేల బయటకు తీసికొని రాఁగోరెదరు.

భైర—చెప్పెదను వినుము. రామలక్ష్మణులనుఁ దెచ్చి మన రాజచంద్రుఁడు కాళికాలయంబున నునుచుట నీ వెఱింగినదే కదా!

అటుపిమ్మట నొకవాన రేంద్రుండరుదెంచి సైన్యసహితంబుగ మన రా జేంద్రునిజీవచ్ఛవంబు జేసె.ఆసంగతి విని మాతంగీదేవిగారు నీలమేఘు ని చెఱవిడిపించితీసికొని రా నన్నునియమించిరి. గనుక ఆలస్యంబుసేయ క వానిని సత్వరము చెఱనుండి విడచిపుచ్చుము.

కారా—చిత్తము. (అని నిష్క్రమించి మరల నీలమేఘునితో ప్రవేశించి) అమాత్యవర్యా! ఇతఁడే నీలమేఘుఁడు. నేనరిగి నావనిమీఁ దనుండెదను. (నిష్క్రమించును)

భైర—అమాత్యవర్యా! నన్ను చెఱనుండి బయటకురప్పించిన కారణంబేమి?

సీ. చెఱలోననేనున్న తెరవవేరొకరాజ
తనయుఁగోరదటంచుఁ దలచినన్ను
చంపంగఁ బంపఁగాఁ జనుదెంచినాడవో
వేరొకరాసుతు వెలదిపెండ్లి
యాడినదను చెఱవీఁడజేయఁగఁబంపఁ
జనుదెంచినాడవో సరసమతిని
తనపుత్రికను నాకు మనమారఁగూర్పఁగాఁ
దలచినిన్నంపెనో ధన్యచరిత

తే. గీ. వేగముగఁదెల్పినను బంపఁవేడువాఁడ
చావొసుఖమొకొ తెల్పు మాసత్వరముగ
వందనమొనర్తు మీపాదపద్మములకు
మహితగుణసాంద్ర! భైరవమంత్రిచంద్ర.

భైర—అయ్యా! నీలమేఘా! ఇఁక నీవు నాకు నమస్కరింపనే ల! మేమేమీపాదదాసులమై పడియుందుము.

నీల—మంత్రివర్యా! కారాగృహంబుననున్న నన్ను మీరిట్లు పహసింపన్యాయమా?

భైర—నిన్ను నేనెప్పుడైన పరిహసించితినా! జరిగినసంగతినం తయు నెఱింగించెద. వినుము.

తే. గీ. కుటిలుఁడగు రావణాసురకోర్కెదీర్ప
దశరథమహీశపుత్త్రుల ధర్మగుణులఁ
జట్టితెచ్చెను సీమామ ప్రౌఢిగోఁడ
తెచ్చెనో లేదొ యొకకొత్తివచ్చెపురికి.

అట్లరుదెంచి భటామాత్యసహితంబుగ సీమామనుయమపురంబున కంపె. అట్లాతఁడు రణరంగంబునఁగూలుటవిని మీయత్తగారుతనముద్దుల పుత్త్రికను మంజువాణిని నీకు సహధర్మచారిణినిగ నొనర్చి సకలదానవ రాజ్యలక్ష్మిని నీకొసంగఁదలంచితోడి తెమ్మని నన్నంపె. అదికారణము గ నేనిట్లరుదెంచితిని.

నీల—(దుఃఖముతో) హా! మంత్రీ! ఏమంటివి. నిఖిలలోకభ యంకరుఁడగు నామామ వలీముఖంబుచేత జీవంబులఁ బాసెనా! నిశా చరవంశకలశార్ణవరాకాసుధాకరా! రాక్షసశేఖరా!

ఉ. ఆలములోన దేవతలనందర నొక్కక్షణంబులోన; గో
పాలురఁ జేసినట్టి బలవంతుఁడవయ్యును నొక్కకోఁతిచే
యాలములోనఁగూలితివె హా! దనుజాధిపచంద్రమా! భవ
త్పాలితమైనుఖంబుఁగను వర్ధిలులంకనుమీఁడి; యక్కటా.

మఱియును,

తే. గీ. అగ్ని యింద్రుండు జముఁడు యేయధిపుదయను
పొందఁగాఁ నోచి వాకిటనుండురెపుడు
నట్టి జగ జేకవీరుఁడు యాలమందు
పాడుకోఁతిచేఁ గూలెనె భైరవుండ!

భైర—కుమారా! ఏమిచెప్పుదును. ససైన్యంబుగ సీమామ

సంగ్రామంబునహతుఁడయ్యె. ఆ కారణంబున మీయత్తగారు సర్వసామ్రాజ్యంబును నీకీయఁదలంచి నిన్నుదోడ్కొనిరమ్మన నేనరుదెంచితిని.

నీల—అమాత్యా! భైరవా! సకలరాజలోకంబును నిజప్రతాపానలార్చుల గడగడలాడించిన జగదేకవీరుఁడు జీవంబులుబాసిపోవ మనముండి ప్రయోజనం బేమి? కావున.

ఉ. వానరుతోడఁబోరెదను వారిజసంభవుఁడడ్డువచ్చినన్
ఆనరమిత్రుఁడైన హరినాజినివానికిఁదోడుచూపినన్
మానితశౌర్యుఁడైనశతమన్యుఁడు బాసటవచ్చినిల్చినన్
మానను సంగరంబు దునుమాడెదమారుతపుత్రు భైరవా.

భైర—కుమారా! నీలమేఘా! శాంతించుము. వాయునందనుని పరాక్రమముముందర చతుర్దశభువనంబులేకమైనను నిలువఁజాలవు. అట్టియెడ మనమేపాటి!

సీ. మారుతతనయుని మర్దింతుననిలోన
నంచునీమదిలోన నెంచకయ్య
వినువానిపూర్వపుకథను లెఱింగించెద
బాలభానునిఁజూచి ఫలమటంచు
కబళించెవానిమీద ఘనుఁడులోకారాధ్యుఁ
దిననాథునొద్ద వేదములు చదివె
పిదపసూర్యాత్మజప్రియసచివుండయి
శ్రీరామభక్తుఁడన్ కీర్తిఁగని
తే. గీ. దుష్టరావణుబలముల దోర్బలమున
సంగరాంగణమందు నిస్సంశయముగ
దునిమెనవ్వీరు బలిమికేమానవాధి
నాథుఁడైననుతులయగాని ధరణియందు,

కావున

చం. పగదిగవాడివాయుసుతు పావనపాదములాశ్రయించినీ
పగణితకీర్తిశాలివయి యబ్ధిపరీతమహీతభూమి యిం
పుగ పరిపాలనంబు మునిముఖ్యులకుం బతితప్రమోదదా
యిగ నొనరించి కాంచనగు సిద్ధసుఖంబులు రాక్షసోత్తమా.

అదే నీజననియు మరుత్సూనునితో నేమిరో ముచ్చటించుకొనుచు యిటులనే వచ్చుచున్నది. నీవు వారిచ్చటకు వచ్చునంతనే నిశ్చలచిత్తుఁడవై నమస్కరింపుము.

(హనుమంతుఁడు దుర్దండి ప్రవేశించుచున్నారు)

హను—సోదరీ! నీయగ్రజామరణవిధానమును నీవెఱింగింపనిచో నాప్రయత్నమంతయు వమ్మయ్యెడిఁగదా?

ఉ. భానుఁడుప్రాఙ్నగంబుపయి భాసిలెనేనియు రామలక్ష్మణుల్
ప్రాణముఁబాయువారెకద? భామినినీవటుసాయమీయగా
పూనినిశాచరాధమునిపోరునలీలగఁ గూల్చువాఁడ తే
జేనిమదీయదోర్బలమదెమ్మెయిఁజూచి సవమ్మయౌఁగదా.

దుర్దం—పవనకుమారా! ఇందుపొగడఁదగినంత సాహాయ్యమే నేనొనర్చితిని. దుష్టుఁడగుటచే మదీయసోదరుండు దేవరభుజబలాగ్ని కాహుతియయ్యెను. దాన నేనుమీకించుక సాహాయ్యంబొనరించితిని. దానికైనన్నింతఁ యగ్గింపనేల?

హను—వనితామణీ! అట్లనకుము.

సీ. నీసహాయంబున నెలతదాటితితుల
పలుగురక్కసిమిందు భంగపరచి
నీసహాయంబున నెలతదాటితిపురి
కోటగోడలనెల్ల మీటిపైచి

నీసహాయంబున నెలతగాంచితి రామ
చంద్రుల మెచ్చులనందిలోన
నీసహాయంబున నెలతద్రుంచితిరణ
క్షోణిరక్కసకోటి ప్రాణమాడ్కి

తే. గీ. ఇంతటి సహాయ మొనరించితింతకన్న
సాయమింకేమి కావలెసాధ్వి చెపుమ
నిన్ను స్తుతియింపఁ ధరమానె నీలవేణి
నలువకైనను వేనోళ్ల చిలువకైన.

అట్టి నీకు నేనేమి మేలుచేయఁగలను సోదరీ!

కం. ఏకడనుం డెను నీనుతు
నాకపటాత్ముండు దుర్మదాంధుఁడు ఖలుఁడున్
నాకుంజూపుమ యిప్పుడె
నాకరమూల వానిచెఱ చనంగ నొనర్తున్.

దుర్గం — దేవా! భవదీయకృపారసము మాపైకలుగవలయునే కాని నానుతు చెఱనిమేషంబున విచ్ఛిన్నంబైచనదే! అదేనాతనూజుని కారాగృహము రండు పోవుదము.

హను — సోదరీ! చూడుము. అచ్చటనెవ్వరో ప్రసంగించుచుండిరి. వారెవ్వరు? పగవారు కారుగదా?

దుర్గం — కారు. దేవా! కారు. వారిరువురు తమకురక్షణీయులే. అందుయువకుఁడు నాపుత్రుకుఁడు. ద్వితీయుండు ప్రభుభక్తిపరాయణుండగు అమాత్యుఁడు. సత్యమార్గానువర్తి. మనమచ్చటికరుగుదమురండు.

హను — సరియే! పోవుదము పద.

భైర — కుమారా! అదేవారును మనసమీపమునకు వచ్చుచున్నారు. సమీపించినంత సంరక్షింపప్రార్థింపవలయును. మామనుదున్నాడెనని నమస్కరింపక యూరకుందువుసుమా?

నీల—చిత్తము. అమాత్యునికోరిక నెఱవేరునుగాక!

హను—దుర్గం—(నిరాకరించుదురు)

నీల—ఆర్తలోకరక్షణదీక్షాపరతంత్రా! అనిలపుత్రా! రక్షింపుము, రక్షింపుము.

సీ. అసనూతిదుఃఖంబుఁగనలేకఁ దరిచేర్ప
చిత్తంబునందెంచు శివుఁడవీవ
కపులసాయముతోడ విపులవారాసిని
క్షణములోదాటి నధునుఁడవీవ
లంకాపురంబు నిశ్శంకతోఁజొరఁబడి
ప్రాకారములఁ గూల్చుబలుఁడవీవ
జనకజజాడలఁగని రాఘవునకట్టె
తెలియఁజేసిన యట్టిదిట్టవీవ
తే. గీ. భక్తులనుఁగాచి ప్రఖ్యాతిఁబడసినట్టి
పార్వతీనాథుఁడవు నీవపవనతనయ
నీపదాంబుజముల నమ్మినిన్నుఁగొలువఁ
గోరినాడను కావు సమీరపుత్ర.

(అని పాదములపాలుడు)

హను—కుమారా! నీలమేఘా!

ఉ. మామనుసంగరంబునను మారొ్కనిచంపెనితండటంచు నీ
వేమియుఁ గ్రోధమందకుము హీనపుబుద్ధినతండుకోసల
క్ష్మామణులన్ వధించుటకు కైకొనివచ్చుటఁజేసి యీలమం
దామయిరావణున్ గెడపి తయ్యభృతింబుగనీలమేఘుఁడా.

అదియునుంగాక.

కం. తరుణులఁ జెఱఁబెట్టుటచే
సురవరులను చిక్కులందు సొక్కించుటచే
దురమున దనిమితి వాతని
వైరము సేవ్రాని వాని బాలక వినుమా.

దుష్కార్యములొనర్చి లోకంబున చిరస్థాయులైన వారెవ్వరు? కావున వానిపై కోపగింపక నీకోరిన సతీమణిని పరిణయంబై సుఖంబుగాంచుచు రసాతలాధిపత్యంబు వహించి సర్వజనానందకరంబుగ పరిపాలనం బొనర్పుము. మంత్రి! యీపురద్వారంబునఁ గాపాడుచున్న మత్స్యవల్లభుని సత్వరంబు పిలువనంపుము. అతండు మదీయాత్మజుండు.

భైర — దేవా! ఇదివరకే నేనాతనికొఱకై సేవకునిఁ బంపియున్నాను. అతఁడింత కరుదెంచుచునే యుండును.

హను — సోదరీ! నీకోరికలన్నియు నెఱవేఱినట్లేగదా?

దుర్గం — పవనాత్మజా! తమ కృపారసము మాపై ప్రసరింపఁ గోరికలు నెరవేరకుండుటెట్లు?

(మత్స్యవల్లభుఁడు ప్రవేశించుచున్నాఁడు)

మత్స్య — నేడుగదా! చిరకాలగర్భితమైన నాకోరిక ఫలించెను.

ఉ. పుట్టిననాటనుండి జనపూజ్యతనొందిన వాయుపుత్రునిన్
దిట్టను నాదుతండ్రినిట దీర్ఘపరాక్రమ వైభవోన్నతున్
నెట్టనఁ గాంచఁగోరి మదినెంతయు నూహయొనర్చుచుండ; క
న్పట్టిన తండ్రికావఁగ కృపాపరుఁడై మదభీష్టసిద్ధికై.

(ముందుఁజూచి) అదే! మదీయజనకాదు లేమిరో ప్రసంగించుచున్నారు. సమీపించి నమస్కరించెదగాక!(సమీపించి)

తే. గీ. జనక! ప్రణమిల్లుచున్నాఁడ చరణములకు
మత్స్యవల్లభుఁడను నేను మాన్యచరిత!

తనయుఁడగు నన్ను దయఁజూడు ధన్యమూర్తి
అంచితామలగుణగేయ! యాంజనేయ!

హను—(లేవదీయుచు) కుమారా! లెమ్ము! చిరంజీవివగుము. అమాత్యా! నీవు సత్వరంబున నేగి నీలమేఘపట్టాభిషేకంబు పురంబునఁ జాటఁ బంచి పురం బలంకృతంబు గావింప నేర్పాటు చేయింపుము.

భైర—చిత్తము. (నిష్క్రమించును)

హను—సోదరీ! మన మనంతర కార్యంబుల నెరవేర్పన రుగుదమా?

దుర్గం—చిత్తము. పోవుదము. పదుండు.

(అందరు నిష్క్రమింతురు)



ద్వితీయరంగము:—పట్టాభిషేకమందిరము

(నీలమేఘుఁడు భైరవుఁడు, హనుమంతుఁడు, మత్స్యవల్లభుఁడు దుర్గండి ప్రవేశించుచున్నారు.)

హను—సోదరీ! దుర్గండీ!

సీ. నీసోదరునిఁగూల్చి నెలఁత నీకొమరుని
సింహాసనంబుపైఁ జేర్చినాఁడ;
గజరాజగమన! నీకష్టంబులఁ బాపి
యానందమందితి నాత్మలోన;
నైననిప్పుడు నేను మానవతీమణి!
చెప్పెద నొకమాట తప్పకవిను;
నాపుత్త్రికుని వీని నలినాయతాక్షిరో!
యువరాజపదవియం దుంచువాఁడ;

తే. గీ. భైరవుం డెప్పటట్టుల మంత్రిపదవి
విడక నతతంబు వీరికి వీరయోధ

కల్పితవ్యూహాముల జంపఁ గలుగుశక్తి
నిచ్చుగాత! సుఖముండు మింతిదియె!

(నీలమేఘునితో) బాలకా! నీలమేఘా!

మ. జనముల్ సంతసమంద సర్వసురలున్ సమ్మోదముం బొందఁగా
మునులానందముతోడ మెచ్చఁగను నీ పూజ్యప్రధానాళితో
జనలం బేకొని ప్రేమతోడుత ప్రజల్ సౌఖ్యంబులన్ దేల్చి పా
వనపాథోధి పరీత భూవలయమున్ పాలింపు సత్కీర్తితో.

(మత్స్యవల్లభునిఁ జూపుచు)

తే. గీ. సోదరుఁడు సోదరునిఁజూచు శోభతోడ
యీమదీ యాత్మజునినీవు ప్రేమఁగనుము
మంచురాచూలి భర్తని మంచుగాక!
చాలకాలము గుణజాల! నీలమేఘ.

అమాత్యవర్యా! భైరవా!

తే. గీ, బాలకులు వీరలాటను పాలనంబు
సలుపఁగా లేరు జనములు సంతసిల్ల
కానభైరవ! రాజ్యంబుఁ గాచుచుండ
వలయువీరలు ప్రౌఢులై వరలువరకు.

మత్స్య—జనకా! నిరర్థకమగు యీశరీరంబునై మక్కువఁ బూని రక్షోవర్గంబుల చెంతనుండ నామనం బిచ్చగింపకున్నది. అది యునుంగాక; ధరాతలంబున నుద్భవించిన ప్రతిజీవియు సుఖదుఃఖముల కడ్డుపడుదురని భావించి పుత్రులఁగన హేయంబగు ప్రపంచసుఖంబుల కాసించి నేనెట్లుమిమ్ము వీడఁగఁ జాలుగువాఁడను! నేనును మీతో డనే యరుదెంచెద. మఱియును.

ఉ. ఏమహాసీయునిం గనిన యెల్లసుఖంబులుఁ గల్గుచుండునో
రాముని, సర్వలోకప్రియ విరాముని, రాక్షసవంశఖండనో

ద్రాముని, సూర్యవంశకులభూషణుని పంక్తిరథేశసూనుఁడౌ
రాముని, పాదపద్మముల ప్రాంజలినై నిలుపంగఁజేయుమా.

నీల — దేవా! మారుతాత్మజా!

ఉ. ధరణీచక్రము పాలనంబు సలుపన్ దక్షత్వమా లేదు. నా
కరయన్ చక్కని కావిమోవి నవలా కౌఁగిళ్ళపై నాసలే
దురమానాథు పదాంబుజాతములపై దూరున్ మనం బెంతయున్
త్వరగా నోపవమానపుత్ర! గుణసాంద్రా! రామభక్తాగ్రణీ!

కావున నాకోరిక వినుండు.

సీ. ఏవాని పాదసంసేవనంబునఁ జేసి
వాల్మీకి ఘనుఁడౌచు వరలినాడు;
స్వర్గనాథుఁడాది యాస్వర్లోకవాసులు
భావింతురెవ్వాని పదములు మది
ఎవ్వానిపై భక్తి హిందువులందరు
సర్వకాలములందు జరుపుచుంద్రు;
ఎవఁడు చతుర్దశభువనాధినాథుఁడై
క్షీరాబ్ధియందున క్షేమము గను

తే. గీ. ఆగుణాధారు సకలలోకైకవీరు
శ్రీరమాచిత్తచోరు దుర్వారవైరి
వీరవిదళన శరయుక్తు ధీరు రాము
సతము సేవింప డెందంబు చాలగలదు.

కావున నన్ను మీ వెంటఁదీసికొని పోఁగోరెద.

శైర — దేవా! అనిలపుత్రా!

మ. గడచెన్ ప్రాయము సర్వమున్ రణములో హమ్మపాలుతోఁగూడనా
కాముకుల్ జచ్చిరి. వారికైవసటచే కోదండుప్రాణంబులన్

విడువక వాకులకాంతయున్ మడసెనో వీరాగ్రణీ! యింక క
ట్టిడినై మంత్రిపదంబు చేకొనిన బాటింపంగఁ బోరెవ్వరున్
కావున.

చ. వనములకేగి సంతతము భక్తవశీకరు దేవదేవు పా
వన పదసేవభక్తిని కృపాకర! చేయుచు కాలమంతయున్
చనఁగ నొనర్తుఁగాని యిఁకసల్పఁగఁజాల యమాత్యకృత్యమున్
మునులనువేఁడి ముక్తికిని మూలమెఱుంగు దను గ్రహింపుమా.

దుర్గం—అయ్యా! పవనతనయా! నీచేసిన మేలునకేనేమి ప్రత్యుపకార మొనర్చుదానను. చంద్రునకు నూలుపోగనునట్లునే నిదె మీకు నమస్కరించుదానను. కుమారా! నీలమేఘా! నీవేగిన స్త్రీసకలశ్రీమలనందిన యీముసలిగతి యేమగును? నిన్నేకోరి తన యవ్వనమంతయు ధారఁబోయ నువ్విళ్ళూరుచు దినమొక యుగంబుగఁగడపు నీప్రాణప్రియను మంజువాణిని వేమిచేయఁదలఁచితివి. ఈరసాతలసామ్రాజ్యమంతయు మహావైభవంబున నీకు పట్టాభిషేకంబుజేసి జామాతాపుత్రికల సుఖంబుల నేత్రానందకరంబుగఁ గాంచనెంచిన మీయత్తగారి మనోరథంబు విఫలమొనర్ప నెంచితివా? ఇది నీకు తగునా? (మత్స్యవల్లభునితో) అయ్యా! మత్స్యవల్లభా! చిన్నతనంబున నుండియు మాసొమ్ముతినుచు మమ్ముపీడనాడుట భావ్యమగునా? కృపాపరుండవై నాకొమరునకు సాహాయ్యముగనుండ ప్రార్థించుచున్నాను. (మంత్రితో) అయ్యా! భైరవా! నీవీరాజ్యంబును వీడిపోయిన మాకేది దిక్కు. ఈపురజనులనందరిని యీబాలురెట్లు సంతోషపరుపఁగలరు? కావున మాయందు దయాళులరై మీయుద్యమంబును మానవేఁడుచున్నదానను.

హను— నీలమేఘా! జననివాక్యము జవదాటనగునా? సన్మార్గచరుఁడవై రాజ్యపాలన మొనర్చి పుత్రపౌత్రులఁబడసి యనంతరము దేవదేవు నారాధింపఁ గడంగుము. (భైరవునితో) అయ్యా! భైరవా! నీవీరాజ్యంబువిడచిన దేశంబల్లకల్లోలంబు గాదే! కావున కృపాపరులై మంత్రిత్వము నెఱవేర్ప నా ప్రార్థన. కుమారా! మత్స్యవల్లభా!

మ. జనవంద్యుండగు కౌసలేయుని నిజస్వాంతంబునం దెన్నుచున్
వనమందున్నను పాదరాజములపై వాసంబునన్ సల్పినన్
బొనరంబోదాక యింతభేదమును రేపుంమాపునున్ నిశ్చలా
త్మను భావించుచునుండు మాన్నృపుని పుత్రా! మత్స్యగర్భోద్భవా!

కావున పితృవాక్యపరిపాలనాధౌరేయుఁడవై నీవిచ్చటనుండి యీరాజ్యంబున కాధారుండవగుము. నీకోర్కె చెల్లింపనందులకు నాపై నాగ్రహింపకుము నీలమేఘా!

మ. సురసంఘంబులు సంతసంబుగనఁగా సుశ్లోకులైనట్టిభూ
వరమానీంద్రులు మెచ్చి తావకయశో భాగ్యంబపేక్షింపఁగా
సరసుల్ మంత్రులు న్యాయవర్తనముచే సామ్రాజ్యమున్ గొల్వనీ
ధరణిన్ పాలనసల్పు కొమ్ము ఘనదోర్దర్పాతిరేకంబునన్.

బాలకా! నీలమేఘా! నీకింకేమి కావలయును.

నీల— దేవా! మీదయయుండ మాకేమి కొదువ. అయినను నిట్లగుఁగాక!

తే. గీ. ధరణి సస్యసమృద్ధమై దనరుఁగాక!
భూవిభులు సత్యమార్గంబు పూనియుంద్రు

గాక! సుకవులుకీర్తిం గాంతురిగాక!

నెలకు వర్షత్రయంబులు గలుగుగాక!

ఇది భారద్వాజ సగోత్రోద్భవ కోవల్లాన్వయ వేంకటకృష్ణయామాత్యపుత్త్ర పుండరీకాక్షశర్మాభిధేయ విరచిత మారుతివిజయమను శ్రీరావణ వధార్థావకంబున సర్వంబును పంచమాంకము సమాప్తము.

శ్రీరామ చంద్రార్పణమస్తు.

